# మా ఊరు

సహకార గ్రామ జీవనమును

ప్రతిబింబించు కథ.

గ్రంథకర్త:

శ్రీయుత పాలపర్తి ఆంజనేయులుగారు,

మచిలీపట్టణము.



వెల 0—8—0.

# తొలిపలుకు

అతిప్రాచీనమైన మనభారతదేశం, వేలసంవత్సరాలనుండి ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా, ఎన్నిరూపాంతరాలు పొందినా, గ్రీకు, రోమను సభ్యతలవలె పంచత్వంపొందకుండా, తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ వస్తూఉంది. ఇప్పుడు మన దేశచరిత్రంలో మరొక నూతనఘట్టం ప్రారంభమైంది. పాశ్చాత్యసంపర్కంతో యీక్రొత్తదాడి బయలుదేరింది. ఇది మన జాతీయ జీవితాన్ని, యిదివరకువలె ఒక వైపునుండిగాక, దశదిశలనుండి ఎదుర్కొంటున్నది. పాతపునాదులుకూడా కదలిపోతున్నాయి. మూలమూలలకు తాకిడి తగుల్తున్నది. పూర్వం మిన్నువిరిగి మీదపడ్డా కూడుగుడ్డలకు లోపంకలుగలేదు. గ్రామజీవనం కదలికచెందలేదు. ఇప్పుడు ఆపాదమస్తకం కంపించింది. మన జాతీయజీవనం యావత్తు మూసలో కళపెళ కరిగిపోతోంది. క్రొత్తమూసలు తయారుచేసి క్రొత్తరూపం జాతికి కల్పించాల్సిన తరుణం వచ్చింది. కనుకనే దేశంలో మత, సాంఘిక, రాజకీయ, ఆర్థికకలవరం బయలుదేరింది. మన స్థూలదృష్టికి అనేక కార్యకారణసంబంధాలు కనిపిస్తాయి. వాటినిబట్టి యీసమస్యలను ప్రత్యేకంగా సంస్కరించటానికి పూనుకొంటే సమగ్రమైన జాతీయస్వరూపం యేర్పడదు. అందం చందం లేని అతుకుల బొంత తయారవుతుంది. ఒకడు కాలు, ఒకడు చెయ్యి, ఒకడు కన్ను, ముక్కు వేరువేరుగా అవయవాలు తయారుచేసి ఒక విగ్రహాన్ని తయారుచేస్తే అది దిష్టిబొమ్మ అవుతుందిగాని సిద్ధహస్తుడైన శిల్పిమానసక్షేత్రంలో రూపకల్పనచేసిన సర్వాంగసుందరమైన మూర్తికి ప్రతిబింబంగాఎప్పుడూఉండదు.

ఆలాగే మన జాతీయజీవితంయొక్క సమగ్రస్వరూపాన్ని ముందు దర్శించితేనే నిజమైన నవజీవనం సాధ్య మవుతుంది. అట్టిస్వరూపాన్ని ప్రదర్శించటమే 'మాఊరు' ఉద్దేశం.

ఇప్పుడు గ్రామపునర్నిర్మాణంవిషయంలో అందరు ఏకాభిప్రాయులుగా ఉన్నారు. దాని సాధనవిధానంలో కూడ పొందిక కుదిరితేగాని జాతీయసౌధానికి గట్టిపునాది యేర్పడదు. మన జాతీయజీవనం నిలకడలేని నగరాల్లోకంటె గడబిడ లెరుగని గ్రామాల్లోనే ఉంది. గ్రామమే యిప్పటికీ మన జాతీయజీవనానికి పునాది. దాన్ని బలపరిచి దానిమీద కట్టిన జాతీయతే సజీవంగా, సమగ్రంగా ఉంటుంది.

గ్రామం జీవనంతంగా ఉండాలంటే దానిస్వరూపానికి, వ్యక్తిత్వానికి, భంగం కలుగకూడదు. శరీరంలోఉన్న వివిధావయవాలు శరీరంయొక్క ధారణకు, పోషణకు, వ్యక్తిత్వానికి లోపం లేకుండా ఒక కేంద్రనాడీశక్తికి లోబడి పని చేస్తున్నట్లుగానే గ్రామార్థిక విద్యాసాంఘికాది విషయాలన్నీ, గ్రామంయొక్క సంపూర్ణవికాసానికి బాధ్యతవహించిన ఒక కేంద్రంనుండి నడవాల్సిఉంటుంది. ఈకేంద్రం గ్రామ సంస్పర్శలేని ఒక డిపార్టుమెంటులోగాక గ్రామప్రజలకు సంబంధించినదిగానె ఉండాలి. అప్పుడు ప్రతివ్యక్తి గ్రామజీవనంలో ఐక్యమై తన వ్యక్తిసౌఖ్యాన్నికూడా దానిద్వారానే పొందుతాడు. సంకుచితమైన స్వార్థదృష్టి పోయి, విశాలమైన సమష్టిభావం కలుగుతుంది. ఇట్టి సమన్వయసాధనమార్గాన్ని చూపటమే 'మాఊరు' లక్ష్యం.

మన గ్రామజీవనం అంటె విద్య, ఆర్థికవిషయాలు, పైరుపంటలు, సాంఘికసమస్యలు, పరిపాలన, యివన్నీపరస్పర

సంబంధంలేకుండా యిచ్ఛారాజ్యంగా నడుస్తున్నాయి. దాని వల్ల గ్రామమొత్తానికి అపారమైన నష్టం కలుగుతోంది. దీన్ని గ్రామస్థులు గ్రహింపక కయ్యాల్లోనూ, కక్షల్లోనూ, దిగి తమ అర్థబలాన్ని, బుద్ధిబలాన్ని, సంఘబలాన్ని వ్యర్థంచేస్తున్నారు. ఈశక్తులనన్నిటినీ నాశనకరమైన స్వార్థమార్గాల్లోనుండి త్రిప్పి సమష్టిలాభదారుల్లోకి ప్రవహింపచేస్తే గ్రామం సిరిసంపదలతో శాంతిసఖ్యతలతో యేలాతులతూగుతుందో 'మాఊరు' చూస్తే తెలుస్తుంది.

దీనికి కీలకం యెక్కడ ఉందీ అని అడుగుతారేమో? 'మాఊరు' వలెనే గ్రామాన్ని ఆధారంగా తీసికొని సహకార సూత్రంద్వారా గ్రామంలోని అన్నిశక్తులనూ, అన్నిలోటుపాటులనూ, వృద్ధిమార్గాలనూ కూడగట్టుకొనిరావడానికి, సమన్వయదృష్టితో సంస్కారాలను నడిపించటానికి గ్రామసేవాభిలాషులు పూనుకొనవలసిఉంటుంది. భావప్రపంచంలో గాలిమేడలుకట్టి ప్రయోజనంలేదు. కొద్దో, గొప్పో ప్రస్తుతంఉండే విధినిషేధాల్లో ఉపకరించే విధానం కావాలి. విప్లవాలు, విపరీతపరివర్తనాలు కృతయుగం తెచ్చిపెట్తాయి అంటే ఉద్రేకం కలుగుతుందిగాని ఊరట కలుగదు. అందుచేత ప్రభుత్వశాసనాలు అవకాశం యిచ్చిన మేరకు మన వ్యవసాయాన్ని, విద్యనూ, వ్యాపారాన్ని, ఆరోగ్యాన్ని వృద్ధిపొందించి, సమష్టిగా గ్రామంలోని బీదా సాదా అందరు, స్పర్థ సంఘర్షణ లేకుండా సుఖపడేమార్గం యేదీఅంటె సహకారవిధానం తప్పితే మరొకటి లేదు. అందుచేతనే విదేశాల్లోకూడా సామ్యవాదాన్ని సహకారాస్త్రంచేత ఉపసంహారంచేయటానికి పూనుకొన్నారు. మనకూ అదే ముక్తిమార్గం యిప్పట్లో.

ఈ గ్రంథంలోని 'ఏవూరు' యేదీఅంటే 'మాఊర'ని ప్రతిగ్రామవాసి చెప్పేభాగ్యం తొందరగా కలగాలనే గంపెడాశతో యీగ్రంథానికి 'మాఊరు' అని నామకరణం చేయబడింది. గ్రామ సేవయందు నాకుగల అభిలాషను పూర్తిగ కార్యరూపేణ తీర్చుకోటానికి శక్తి లేకపోవటంచేత ఆత్మతృప్తి కోసం గత జూలై, ఆగస్టునెలల్లో యీకథ కల్పించి వ్రాశాను. ఇప్పుడు మనం కళ్ళతో చూస్తూఉన్న జాతీయ జీవితాన్ని కేవలం ప్రతిఫలింపజేయటమే కాకుండా, గ్రామోద్ధరణరూపంగా తరణోపాయంకూడ వ్యక్తంచేయటంచేత, దీన్ని చదివిన ఆప్తమిత్రులు కొందరు ప్రకటించమని ప్రోత్సాహపరిచారు. పిమ్మట గాంధిమహాత్ముడు, ప్రభుత్వంకూడా గ్రామ సేవకే ప్రజలను పురిగొల్పటం తటస్థించింది.

సహకారమార్గంవినా అన్యమార్గం లేదని ఉద్బోధం చేయటానికి ఉద్దేశింపబడ్డ గ్రంథం సహకారసంఘంద్వారా ప్రకటింపబడుట సమంజసంగా ఉంటుందని తలచి, కృష్ణాడిస్ట్రిక్టు కో-ఆపరేటివు ఫెడరేషనువారిని కోరగా, వారు దయతో ప్రకటించటానికి ఒప్పుకొన్నారు. కనుక సంఘంవారికి, దానికి అధ్యక్షులైన శ్రీయుత నల్లూరి పాపయ్యచౌదరీగారికిని, గ్రంథం అచ్చువిషయంలో అనేకవిధాలసహాయం చేసిన నా మిత్రులు శ్రీయుత దిగవల్లి వేంకటశివరావుగారికిని కృతజ్ఞుడనై ఉన్నాను. ఆంధ్రగ్రంథాలయ ప్రెస్సువారి తోడ్పాటు లేకపోతే యింత త్వరలో యీగ్రంథాన్ని పాఠకులకు సమర్పించుకునే భాగ్యం కలిగేదికాదు. అందుచేత వారికి నా నమస్కారాలు.

బందరు,
1—7—35.

పాలపర్తి ఆంజనేయులు.

# సవరణలు

29 వ పుట. 12 పంక్తిలో 'ఎందుకో' తీసివేయునది.

33 వ పుట. 12 పంక్తి తర్వాత ' నీవు యెచట ప్రచారం చేస్తున్నావు? ' చేర్చవలెను.

43 వ పుట. 7 పంక్తి 'తీన్చారై' తప్పు. 'తీన్తారై' ఒప్పు.

89 వ పుట. 4 పంక్తి ' కూడా ఉన్నా ' తప్పు. ' ఉన్నా కూడా ' ఒప్పు.

ఓమ్

# నా ఊరు

## మొదటి భాగము.

### ౧. రామయ్యచౌదరి యిల్లు — ఉద్యోగప్రశంస.

రామయ్య—(కొడుకుతో) నీవు బి. ఏ. ప్యాసు అయినావు. గొప్ప ఉద్యోగం చేస్తావు, కుటుంబానికి పేరు, ప్రతిష్ఠ, తెస్తావు, అని గంపెడాశతో ఉన్నాం. నీవు చూస్తే ఎప్పుడూ యేదో తలపోసుకొంటూ, నిమ్మకు నీ రెత్తినట్టు ఊరుకొంటావు. ఎప్పుడు యెవరితో యేం అవసరం వస్తుందో అని ఉద్యోగస్థులందరిని మంచిమాటలు చేసుకొంటూ, వాళ్ళకేమి సప్లయిలు కావల్సినా చేస్తూ, ఇప్పటికి యెంతకాలం నుంచో వాళ్లందరికి తల్లో నాలుకలాగ మెలగుతున్నా. రివిన్యూబోర్డు మెంబరు మొదలు ఉద్యోగస్థు లందరు మనను యెరుగనివాళ్లు లేరు; మన ఉప్పూ, పులుసు తిననివాళ్లు లేరు. మన జిల్లాలో నేను, మీమామ తప్పితే యింకొకరు యింత పలుకుబడికలవాళ్లున్నారా? రెండువైపుల యింత స్తోమతు ఉండికూడా నీవు ఉద్యోగం చెయ్యనంటె మా పేరూ, ప్రతిష్ఠ, గణ్యత, పలుకుబడి అంతా వ్యర్థమేగదా!

నాగయ్య—మీపేరుప్రతిష్ఠలు నా ఉద్యోగంమీదనే ఆధార పడి ఉన్నాయా? నా ఉద్యోగంతోనే సార్థకమవుతాయా? మీరే కష్టపడి సంపాదించుకొన్నారు.

రామయ్య—ఫలాని రామయ్యకొడుకు తాసిల్దారు చేస్తున్నా డంటే నాకు గౌరవంకాదూ. మన కుటుంబానికి, మన కమ్మ సంఘానికి యెంత పేరుప్రతిష్ఠ లుంటాయి! ఇంతవరకూ బ్రాహ్మలకే నమస్కారాలు పెట్టాల్సివస్తున్నదిగదా. ఉద్యోగం లేకపోతే మన కెవరు దణ్ణం పెడ్తారు! ఎవరు గౌరవిస్తారు?

నాగయ్య—ఉద్యోగం చెయ్యడం దర్జాకోరకు, అధికారంకోరకు, దణ్ణాలు పెట్టించుకోటానికేనా? ఉద్యోగం చెయ్యని వాళ్ళు మాత్రం గౌరవమర్యాదలు పొందడంలేదూ? ఉద్యోగస్థుల గౌరవం ఉద్యోగంతోనే ఆఖరు. ఉద్యోగం పోయిన మర్నాడు ఆయన్ని తలచేవాళ్ళు, పిలిచేవాళ్ళు ఉండరు. అయినా, ఎంతమందికని ఉద్యోగాలు వస్తాయి. చదువుకొన్నవాళ్ళంతా ఉద్యోగాలు చెయ్యాలంటే అవి మాత్రం యెక్కడినుంచైనా ఊడుతాయా?

రామయ్య—నీ కెందు కాగొడవ? ఒకరికోసం ఒకరు మానుతారా? ఎవరితిప్పలు వాళ్ళవి. మన కవకాశం ఉన్నప్పుడు మనం సంపాదించుకొంటాం; లేనివాళ్ళు లేనట్టే ఉంటారు. వాళ్ళఖర్మం వాళ్ళది. ఇంతకూ నీవు ఉద్యోగం చేస్తావా? చెయ్యవా? తాలూకాగుమాస్తానౌకరీ కాదు. ప్రొబేషనరీ డిప్టీతహసిల్దారుకు ప్రయత్నం చేస్తున్నాను. ఆఖరుకు రివిన్యూ ఇన్‌స్పెక్టరైనా స్టార్టింగు యిస్తారు, తప్పదు.

అప్పయ్యచౌదరి—నాకూ కొంత బాధ్యత ఉన్నది. కాబట్టి నా లుగుమాటలు చెప్పి చూద్దామని వచ్చాను. మీనాన్నగారి కంటె నేను యెక్కువ చెప్పతగ్గది యేమీలేదు. ఆయనగొప్ప తనానికి, పేరుకు, ప్రతిష్ఠకు తగినట్టు నీవుకూడా యేదైనా గొప్పఉద్యోగంలోకి వస్తే మాకందరికి సంతోషం, గౌరవం. మన రామకృష్ణ చూడు. మనకమ్మసంఘానికి యెంత గౌరవంగా ఉన్నాడో! అల్లాగే మనవాళ్లు నలుగురు పైకి యెక్కువస్తేసంఘానికెంతో గొప్ప; ఎంతో మర్యాద. నీవు బుద్ధి తెలిసినవాడవు. 'సిరి రా మోకాలడ్డువారున్నారా?' అన్నట్టు మనకేదో ప్రాపకం ఉండి, మనహోదాకు తగిన ఉద్యోగం లభించడానికి అవకాశముంటే మన మది కాల్తొన్నకోటం శ్రేయస్సుకాదు. నీవు ఉద్యోగంలో ప్రవేశించడం మా అందరి కోరిక; కాదంటావా, నీ యిష్టం నీది.

నాగయ్య—మామగారూ! మీరు పెద్దలు. మీ అందరిమాటలకు అడ్డుచెప్పమంటె నాకు చాల కష్టంగా ఉంది. కాని నా దృష్టి ఒకటిగా ఉంది; మీది మరొకటిగా ఉంది. రామకృష్ణ కలెక్టరు చేయడం గొప్పే కావచ్చు. దానివల్ల సంఘానికి, దేశానికి జరిగిన మహోపకారం యేదో నాకు బోధపడలేదు. ఆయన కెంత దేశాభిమానం ఉన్నా సంఘాభిమానం ప్రభుత్వం పెట్టిన వరవడిలో నడుచుకోవాల్సిందే గాని ఒక అంగుళం తప్పి నడవడానికి వీల్లేదుగదా! దేశావసరాలన్నీ ఒక్క ప్రభుత్వంవల్లనే తీరగలవా? కనుక అస్వతంత్రమైన ప్రభుత్వ యంత్రంలో బిగుసుకొనిపోవడం

కంటె "మడి దున్నుకొని బ్రతుకుట మే"లని నాకు తోస్తు న్నది. నామోస్తరు అభిప్రాయాలు, చిత్తవృత్తి, కలవాడు ఉద్యోగంలో ప్రవేశిస్తే నాలుగురోజులయినా ఉండజాలడు. నాదారిని నన్ను పోనిచ్చారా, నాచేతనైన సేవ సంఘానికి చేస్తాను. ఎంతమంది విదేశాలకు వెళ్లి గొప్పగొప్ప పరీక్షలిచ్చివచ్చి ఉద్యోగాలు వదులుకొని దేశసేవచేయడంలేదూ! వాళ్ళముందు నేనూ, నాచదువూ ఒక లెఖ్ఖా.

రామయ్య—మీ దేశసేవలూ, స్వరాజ్యాలూ చూస్తూనే ఉన్నాంగా; లాటీదెబ్బలు తినడం, జైలుకు వెళ్లడం. ఇదేం పుణ్యమా? పురుషార్థమా? పేరా? ప్రతిష్ఠా? దేశమంతా ధ్వంసం చేసేశారు. చాలు, చాలు, ఈ తలతిక్కపనులు నాదగ్గర సాగవు. నీవల్లవచ్చే ప్రతిష్ఠ లేకపోయినా, ఫలానీ రామయ్యకొడుకు నాన్-కో ఆపరేటరనే కీర్తి సంపాదిస్తావు కాబోలు. ఇంతవరకు యే కలెక్టరువద్దకు వెళ్లినా, యే ఉద్యోగస్థుడువద్దకు వెళ్ళినా ఎంతో మర్యాదగా కుర్చీయిచ్చి గౌరవిస్తూన్నారు. ఇక నాకు తలవంపులే కాబోలు. నీ మొఖం చూస్తే నాకు ఒళ్లు మండుతున్నది. తింటే నాలుగు మెతుకులు తిని ఒకమూల పడిఉండు, లేదా కొంపలోనుంచి లేచిపో. నాకంటికి కనిపించబోకు. నీ దేశసేవలు గీశసేవలు కట్టిపెట్టు; జాగ్రత్త! .........అని చురచురలాడుతూ వెళ్ళిపోయినాడు రామయ్యచౌదరి.

---

## ౨. సంసార స్థితి.

జానకమ్మ—పోనీ, మీ నాన్నగారు చెప్పినట్లు వినకూడదూ. ఎందు కంత కోపం తెప్పించడం ఆయనకు? ఉద్యోగం అందరు చెయ్యడంలేదూ. నీవుమాత్రం చేస్తే తప్పేమిటీ?

నాగయ్య—ఉద్యోగం చేస్తే తప్పని నా ఉద్దేశంకాదు. ఎవరికే ఉద్యోగంలో ఆసక్తి, ఉత్సాహం ఉందో అది చేస్తే వాళ్ళకు కులాసా, ఆనందం ఉంటుంది. అది కష్టమైందిఅయినప్పటికి సుఖంగానే ఉంటుంది. ఇష్టంలేని ఉద్యోగం యెంత గొప్పదైనా, సుఖమైం దైనా కష్టంగానే ఉంటుంది.

సుశీల—అందరు ఇష్టముంటేనే ఉద్యోగం జేస్తున్నారా?

నాగయ్య—మీరందరు యీ విషయంలో యింత శ్రద్ధ పుచ్చుకొంటున్నందుకు నాకు సంతోషమే. కాని నే చెప్పే విషయంకూడా కొంచెం ఆలోచించండి. ఉద్యోగంచెయ్యడంలో మన ఉద్దేశం యేమిటి? భుక్తికోసమా? ముక్తికోసమా? రెండూకాదు. భుక్తియేమో దేవుడు ప్రసాదించింది ఉండనే ఉంది. ముక్తి యీ ఉద్యోగం వల్ల రాదుగదా. ఇక పోతే, అధికారంకోసం, ధనంకోసం ఉద్యోగం చేయాలె. భుక్తికోసం ఉద్యోగంచేసే మనిషి.కంటె, కేవలం ధనంకోసం, అధికారంకోసం ఉద్యోగంచేసేవాడు క్రిందు మీదు కానకుండా సంచరిస్తాడన్నమాట వేరే చెప్పాల్నా? వా డెప్పుడు తన అధికారంచెలామణి అవుతున్నదా, లేదా? తనకు డబ్బు వస్తున్నదా, లేదా? అని చూచుకొంటాడు గాని 'అయ్యో మన పనులవల్ల కష్టపడుతున్నారా, నష్టపడుతు

న్నారా ?' అని కల్లోనైన విచారించడు. వాడు చేసే దురాగ్రాలకు అంతు ఉండదు. ఇటువంటి ఉద్యోగంవల్ల మనిషి రాను రాను కిరాతు పోతాడు.

సుశీల—అంతా ఆలా అయిపోతున్నారా? పోనీ, మనిషి కేదైన వ్యాపకం ఉండాల్నా మరి?

నాగయ్య—వ్యాపకం లేకుండా ఏ మనిషి ఉండడు. ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ ఏదో వ్యాపకం మంచిదో చెడ్డదో ఉండవలసిందే. ఉద్యోగం ఒక్కటే వ్యాపకంకాదు. మనుష్యులు చేసే పనులన్నీ, వృత్తులన్నీ, ఉద్యోగాలన్నీ వ్యాపకాలే. కాని దేవుడిచ్చిన వివేకం ఉపయోగించి మనకు,సంఘానికి కూడా ఉపకరించే వ్యాపకంలో ప్రవేశించడం ఉత్తమమైన పని. అదీ, నే పెట్టుకోదల్చుకొన్న వ్యాపకం.

జానకమ్మ—ఇప్పటినుండి యిన్ని ధర్మపన్నాలు చదువుతుంటే యిక లోకంలో నీవు యెట్లా పైకి వస్తావురా?

నాగయ్య—అమ్మా, ధర్మం వదలిపెట్టితే గాని పైకి రామా యేమిటి? అంత కూడని ధర్మంకోసం యెందుకు మనిషి ప్రాణాలర్పించడం? ఎవరైనా ధర్మకార్యాలు చేస్తే ఆయన్ని ధర్మరాజని పొగుడ్తాం, ఆయనకు దణ్ణాలుపెట్తాం. ధర్మంకోసం మన మనస్సు కూడా పరితపిస్తూ ఉంటుందే అప్పుడప్పుడు; స్వలాభానికి అడ్డుతగిల్తేమాత్రం ధర్మాన్ని దరికి రానివ్వం. ఇ దేంన్యాయం చెప్పూ?

జానకమ్మ—నే నిప్పుడు నిన్ను అన్యాయాలు, అధర్మాలు చెయ్యమనడంలేదు. ఏదో పెద్దవాళ్లు చెప్పినట్టు నడుచుకోమని మాత్రం చెప్తున్నా.

నాగయ్య—పొలం బాట్రా గల రైతుబిడ్డలు నాలుగుముక్కలు చదువుకుంటే యింటిమొఖం చూడకుండా పట్నాలు పట్టుకొని వేళ్లాడడం సరిపా పైపోయింది. పొలాలు పాళ్లే మాలాళ్లపా లవుతున్నాయి. చదువులో ఎక్కవచ్చినా రాకపోయినా పట్నం వదలిపెట్టి యింటికి పోవడం పరమ అసహ్యం. పొలం పోవడమన్నా గొడ్డూ గోదా అన్నా అంతకంటె అసహ్యం. ఊళ్లో యేది చూచినా రోతగా కనిపిస్తుంది. దీనివల్ల మనరైతుసంఘమే కాదు. దేశంకూడా నాశనమై పోతున్నది. అందుచేత నేను ఉద్యోగం చేయదలచుకోలేదు. నాన్నకుకూడా పట్నాలన్నా, ఉద్యోగస్థులన్నా చాలా ఉత్సాహం. ఉద్యోగస్థుల స్నేహాలకోసం, వాళ్ల పరిచయాలకోసం, డాబుసరికోసం ఖర్చుచేసేడబ్బు మన తాహతుకు మించిందిగాఉంది. ఆదర్శా నిలవబెట్టుకోటానికి, దొర్లకిచ్చే టీపార్టీలకు, చేసే సన్మయిలకు, వెనకా ముందు లేకుండా ఉంది. మొన్నజిల్లాబోర్డు ఎలెక్షనుకు నాలుగు వేలయినయిట. డబ్బు పుట్టినంతకాలం యిట్లాగే సాగుతుంది. తర్వాతగాని మనతిప్పలు తెలియవు.

జానకమ్మ—అవును, నాయనా! నేను గోలపెడ్తూనే ఉన్నాను. ఆయన వినిపించుకోరు. బ్యాంకులో బోలెడుసొమ్ము కట్టాలి. పర్వతనేనివారి బాకీ పెరిగిపోతున్నది. ఇంకా చిల్లరమల్లర

అప్పులు బోలెడున్నాయి. మొండిగా ఆయన తిరుగుతు న్నాడుగాని తల్చుకుంటె కడుపు చెరువు అవుతుంది. ఇవన్నీ గృహచ్ఛిద్రాలు. ఎవరితో చెప్పుకుంటే ఎవరు తీరుస్తారు?

సుశీల—ఈ ఎలక్షనుపిచ్చి మనవాళ్లను పీల్చుకతింటున్నది. మానాన్నా యీ పిచ్చిలోపడి ఎంతఅప్పుచేశాడు! కోడూరి వారి సంగతి చూడండి! పెళ్లిళ్లా పేరంటాలా? పెద్ద ఆసామేనా మరి? ఇప్పుడు పదియెకరాలు మిగల్లేదు.

నాగయ్య—నీవు చెప్పే సంగతులు వింటే నాకు భయమేస్తోంది. మనకు నిలువ నీడయినా ఉంటుందో, ఉండదో; పొలాలు పాలేళ్లపాలుచేసి మనం బస్తీలో దర్జాగా ఉద్యోగంపేరు పెట్టుకొని రూపాయికి పదిరూపాయలు ఖర్చుచేసికొంటూ ఉంటే, మనగతి యేమవుతుందో. వచ్చేపొయ్యేవాళ్ళకు బస్తీలో ఒక సత్రమేర్పడుతుంది. ఆడవాళ్లయినా మీరు కూడా యీ సంగతి ఆలోచించాలి.

జానకమ్మ—ఏదో బాబు! నీఇష్టం. కొంపకు ముప్పు రాకుండా చూడండి. నీవు బుద్ధితెలిసినవాడవు; చేతికి అందొచ్చిన వాడవుకదా. ఏదో విధంగా యీ రొంపిలోనుండి బయట పడేమార్గం చూడండి.

నాగయ్య—మనం యెప్పుడైనా మేలుకొని ఆస్తి నిలువబెట్టు కోకపోతే పరపతి పోతుంది. మర్యాద చెడుతుంది. సద్దుకో టానికి వీలున్నప్పుడే వ్యవహారాలు చక్కబరచుకోకపోతే తర్వాత చక్కబడవు. నాన్నకు కోపంవచ్చినా సరే, మనం

కొంచెం మొండిమొత్తు వేస్తేనేగాని లాభంలేదు. నేను ఉద్యోగం చేస్తానేఅనుకో, నాకు వచ్చే జీతం ఎంత? వచ్చే పొయ్యే చుట్టాలకీ, స్నేహితులకీ అంతుండదు గదా. మీారు నాతో బాటే ఉంటారు. ఇక్కడి వ్యవహారాలు చూసే దెక్కెవరు? నాన్నదృష్టి యిప్పట్లో మాాకేది కనిపించదు. ఆయన కెప్పుడూ బందరుపోనూ, బెజవాడపోనూ, మద్రాసు పోనూ సరిపోతుంది; ఎక్కేబండి దిగేబండి, దీనితోనే సరి; ఎప్పుడూ పార్టీగుసగుసలే. ఈ స్థితిలో నేను యింటివద్ద ఉండి వ్యవసాయం చేయిస్తా గాని, ఉద్యోగం చెయ్యను. మన వృత్తి వదులుకొని యింకోవృత్తికి వెళ్ళడం అక్రమంగా తోస్తోంది.

జానకమ్మ—నీవు వ్యవసాయమే చేస్తావో, ఉద్యోగమే చేస్తావో, నీ ఇష్టం; మీా నాన్నగారి యిష్టం. మేము పెద్దవాళ్ళ మయినాం; ఉన్నా పోయినా మీాదే. మీాజాగ్రత్త మీారు పడండి. అదిగో వెంకడు కేకవేస్తున్నాడు, నేను వెళ్ళుతా.

---

౩. సంకల్పం.

సుశీల—ఈ రోజులలో ఎవళ్ళకులవృత్తి వాళ్లు చేస్తున్నారా? మీా రెప్పుడో పూర్వకాలపు కబుర్లు చెప్పుతా రేమిటి? ఉద్యోగాలన్నీ బ్రాహ్మలకే ఖరారాశా? మనం చేస్తే దోషమా? కులంలోనుండి వెలివేస్తారా? ఈ రోజులలో యీా మాటలు ఎవరైనా వింటే నవ్వుతారు.

నాగయ్య—ఉద్యోగాలన్నీ బ్రాహ్మలే చెయ్యాలి, ఇంకొకరు చెయ్యకూడదని నాతలంపుకాదు. కులవృత్తిలో ఒకవిధమైన స్వతంత్రం ఉంది. అది తరతరాలకు పెన్నిధివంటిది. నేను చదువుకొన్నవాడ్ని అయితే నా కొడుకులు కూడా చదువుకొని ఉద్యోగాలు చేస్తారన్న గ్యారంటీ యేమిటి? కులవృత్తి అటువంటిదికాదు. సహజంగానే వాడు చిన్నప్పటి నుండి దానికి తర్ఫీతు అవుతాడు. అదిగాక చదువుకోటం ఉద్యోగానికే అనే దురభిప్రాయం పోవాలె. చదువుకొన్న వాళ్లు ఎవళ్లవృత్తి వాళ్లు అవలంబించడంవల్ల ఆ సంఘానికి, వృత్తికికూడ గౌరవం కలుగుతుంది. నేను బి. ఎ. ప్యాసు అయి ఉద్యోగంలో ప్రవేశిస్తే నా సంఘానికి, నా వృత్తికి గౌరవం యెలా వస్తుంది? నేను యింకో సంఘానికి, యింకో వృత్తికి చెందినవాణ్ణి అయిపోతాను. యూరపు దేశాల్లో గొప్పచదువులు చదువుకొన్నవాళ్లు కూడా వాళ్ళ కుల వృత్తి వ్యవసాయమో, వర్తకమో, ఇంజనీరింగో, తోళ్ళ పనో ఏదైనప్పటికి అది చేసుకొంటూ, దేశావసర సమయాల్లో మంత్రిపదవులుకూడా నిర్వహిస్తారు. అందుచేత ఆ దేశాల్లో వృత్తిచేత యే కులానికి, యే సంఘానికి, న్యూనత లేదు. ఏవృత్తీ నీచం గాదు. అది మన దేశానికే దాపరించింది. ఇది నశిస్తే గాని ప్రజలలో ఆత్మగౌరవం, దేశాభిమానం, ఐకమత్యం కలగవు. ఈ రూపంగా దేశంలో చేయవలసిన పని చాలా ఉంది. ఇట్టి స్థితిలో నాకు ఉద్యోగం

చెయ్యడం యిష్టంలేదు. నా దృష్టి అంతా సంఘం మీాదే ఉంది. అయినా నీ అభిప్రాయం కూడా చెప్పు.

సుశీల—నేను మీా కేం చెప్పగలను! నేను మీావలె చదువు కొన్నదాన్నా ?

నాగయ్య—వివేకం, ఆలోచనా ఉండి చదువుకోక పోయినా యిబ్బందిలేదు. చదువుకొన్నప్పటికి వివేకం, విచక్షణ, లేక పోతే ఆ చదువు నిష్ప్రియోజనమే. ఇప్పుడు చదువుకొన్న వాళ్లలో విచక్షణ, యోచన శూన్యమైనాయి. దేశాభివృద్ధికి పెద్దప్రతిబంధకం ప్రజల్లో ఆలోచన క్షీణించడమే. చదువు కొన్న బస్తీవాళ్ళకంటె చదువురాని మన పల్లెటూళ్ళవాళ్లే దేశానికి సంబంధించిన విషయాల్లో మంచి అనుభవజ్ఞానం ప్రకటిస్తున్నారు. వాళ్లు కేవలం ఉద్రేకంలో పడి కొట్టుక పోతారు. మనవాళ్లు సాధక బాధకాలు నిదానంగా విచారిస్తారు; తొందరపడరు. ఇది చూచి ఒకప్పుడు మనవాళ్లు మూఢు లని మనం అనుకొంటాం. విషయం నచ్చచెప్పితే మనవాళ్లవలె కార్యశూరత్వం బస్తీవాళ్లు చూపించలేరు.

సుశీల—మీారు చెప్పింది నిజమేకాని, మామగారికి కోపం వస్తుందేమో అని నాభయం.

నాగయ్య—కోపం వచ్చేమాట నిజమే. మనను కొంపలోనుంచి వెళ్లిపొమ్మంటారేమో. ఏచిక్కు లయినా రావచ్చు. నీవు నాతోబాటు యీా కష్టాలు భరించగలవా? ఎన్నివిధాల ఆలోచించినా నా నిశ్చయంలో నాకు దోషం కనిపించలేదు. పైగా దానికి భిన్నంగా నడిస్తే నాకు మనశ్శాంతి ఉండదు.

సుశీల——మీ నిశ్చయానికి భిన్నంగా నే నెప్పుడూ ప్రవర్తించను. నాకోసం మీ ధర్మాన్ని మీరు విడువనక్కర్లేదు. కష్టమో సుఖమో యిద్దరంకలిసి యాత్రచేయవలసిందే. మీ కేది ధర్మమో దాన్ని అనుసరించడం నా ధర్మం.

---

## ౪. యేవూరు.

బెజవాడ- బందరు రోడ్డుమీద బెజవాడకు ఆరుమైళ్ల దూరంలో ఉంది యేవూరు. ఈగ్రామంలో సాగుబడి అయ్యే భూమిలో కొంతపల్లం, కొంత మెరక. మెరకభూముల్లో చాల వరకు తోటలుపెంచారు. జనం సుమారు 1500 ఉంటారు. బెజవాడకు సమీపంగా ఉండడంచేత రైతుపిల్లలు కొద్దిగానో గొప్పగానో చదువుకోటానికి అలవాటుపడ్డారు. ఒకరిద్దరు మాత్రం బెజవాడలో ప్లీడరీబోర్డు కట్టేరు. ఒకరిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. కొంతమంది పొలం బాటా అమ్ముకొని వ్యాపారాలు చేస్తున్నారు. ఫోర్తుఫారం, స్కూలుఫైనలుదాకా చదివిన కుఱ్ఱవాళ్లు చాలమంది ఉన్నారు. వీళ్లల్లో చాలమంది పొద్దున లేస్తే బెజవాడలోనే ఉంటారు. సినిమాలు, అరవ హోటళ్లు, స్వరాజ్యమీటింగులు, జిల్లాబోర్డు మీటింగులు యివన్నీ వీళ్ళసొమ్మే.

ఈ ఊళ్లోకూడా కక్షల కేం కొదువలేదు. గ్రామమొత్తం మీద ముప్పాతిక గడప కమ్మవారే. మిగతా కులాల వాళ్లు కొద్ది కొద్దిగా ఉన్నారు. ఊళ్లో యేపనైనా కమ్మవారు తలచు

కొంటే అవుతుంది. కాని కక్షల మూలకంగా ప్రజల కుపకరించే పని ఒకటీకొనసాగదు. మీదుమిక్కిలి సివిల్ క్రిమినల్ వ్యాజ్యాలు, దెబ్బలాటలు, దొమ్మీలు జరుగుతుంటాయి. పంచాయితీబోర్డు ఉన్నదన్నమాటేగాని అది దెబ్బలాటలతో కాలక్షేపంచేస్తున్నది. మంచిపని ఒక్కటి చేసిన పాపాన పోలేదు. స్కూలు, యెదుగు బొదుగు లేకుండా ఉంది. త్రాగేందుకు శుభ్రమైన మంచినీళ్లే కఱవు. ఊళ్లో వీధులు గోతులు దిబ్బలు. పెంటకుప్పలు యిళ్ళను మించి ఉంటాయి. చెరువుకట్టలన్నీ కరిగి దిబ్బలయినాయి. వాన కురిస్తే ఊళ్లో మురికినీరంతా చెరువులోకే. ఏది చూచినా గ్రామంలో ఐకమత్యంలేదని ప్రకటిస్తున్నది; పరశ్రేయస్సుగాని, తమ శ్రేయస్సుగాని, గ్రామస్థు లెరుగరని చెప్పకనే చెప్తూ చున్నది.

గ్రామంలో కొంతమంది కాంగ్రెసువాలాలు లేకపోలేదు. ఎఱ్ఱమట్టి ఖద్దరు చొక్కాలు, గాంధిటోపీలు అవసరమైనప్పుడు ధరిస్తుంటారు; కాంగ్రెసు నాయకులు, ప్రచారకులు వచ్చినప్పుడు వీరంతా ప్రత్యక్షమవుతుంటారు. మిగతా అప్పుడు కాంగ్రెసు ఆదర్శాలకు, మహాత్ముని ఉపదేశాలకు స్వస్తి చెప్పి, ఊళ్లో పార్టీలతో మిళితమై దెబ్బలాటలకు, క్రిమినలుచార్జీలకు, సాక్ష్యాలకు సిద్ధమవుతుంటారు.

నామకః గ్రంథాలయం ఒకటి ఉంది. పేపర్లు యెవరైనా తెచ్చి పడేస్తే గుళ్లో కూర్చొని చదువుకొంటుంటారు.

---

## ౫. నాగయ్యమకాం.

మావూరికి తూర్పువైపున రోడ్డుకు దరిగా ఒకవిశాలమైనతోటఉంది. ఈతోట్లో నానావిధమైన ఫలవృక్షాలున్నాయి. తోటలో రెండు డాబాకోట్లు, వానిని ఆనుకొని పెద్ద పెంకుటి సావడి ఉంది. నాగయ్య యెప్పుడు యింటికి వచ్చినా సాధారణంగా కాలమంతా తోట్లోనే గడుపుతాడు. ఒక గదిలో అతని తాలూకు పుస్తకాలు, కుర్చీలు, బల్లలు వగైరాసామానులున్నాయి. అతను చదువుకొన్నా వ్రాసుకొన్నా అంతా తోట్లోనే. చీకటిపడ్డ తర్వాత యింటికి వస్తాడు. కాసేపు గుళ్లో కూర్చొని అందరితో యిష్టాగోష్ఠి కబుర్లు మాట్లాడుతాడు.

ఈ తోట నాగయ్యభార్యకు పుట్టింటివా రిచ్చారు. నాగయ్య పెండ్లికాలంలో కట్నం యేమీ పుచ్చుకోనన్నాడు. అందుచేత నాగయ్యమామగారు కూతురికి అరణంగా యీ తోట యిచ్చారు. ఈతోటే నాగయ్యపనులన్నిటికి కార్యస్థానం. అతని స్నేహితులుగాని, పరిచయులుగానిఇచటనే సాధారణంగా సమావేశ మవుతుంటారు. అతనికి యిచట తెలుగు యింగ్లీషు గ్రంథాలయం మంచిది ఉంది. అతనికి మొదటినుండి రైతాంగ సమస్యలు, గ్రామజీవితసమస్యలు, అంటే చాల మక్కువ. విదేశాల్లో రైతు ఆర్థిక సంపత్తి, విజ్ఞానం వృద్ధిచేయడానికి యెట్టి కృషి చేశారో దానికి సంబంధించిన వాఙ్మయం అతనిదగ్గర చాలా ఉంది. తెనుగు, ఇంగ్లీషు పత్రికలుకూడా తెప్పిస్తాడు.

నాగయ్యకు చిన్ననాటి స్నేహితులు కొంతమంది ఉన్నారు. అతను ఊళ్లోకి వచ్చాడంటే వాళ్లు అతనితో ఉంటారు. వీళ్లుగాక ఊళ్లో యువకులుకూడా అప్పుడప్పుడు యితనివద్ద చేరుతుంటారు. పేపర్లలోని విషయాలన్నీ చదివి చెప్తుతుంటాడు నాగయ్య వీళ్లకు. రైతుసమస్యలు, గ్రామజీవనసమస్యలు యీ యువకులందరితో కలిసి చర్చిస్తుంటాడు. ఈచర్చల మూలకంగా యువకులలో ఆలోచన, ఉత్సాహం, బయలుదేరింది.

మామూలుగా గ్రామంలో ఉండే తగాదాల్లోనూ, కక్షలతోనూ నాగయ్యకు సంబంధము లేకపోవడంచేత రెండుపార్టీల యువకులు జంకులేకుండా నాగయ్యగోష్ఠిలో చేరేవాళ్లు. ఈ గోష్ఠిప్రసంగాలు వినగా వినగా యువకుల్లో దురహంకారం, దురభిమానం వదలి స్నేహవాత్సల్యాలు, ఐకమత్యం యేర్పడజొచ్చినాయి. ఇప్పుడు నాగయ్య గ్రామంలో స్థావరంగా ఉండిపోవడంచేత యువకుల ఉత్సాహం కార్యరూపంగా మొలకెత్తటానికి ఆరంభించింది.

---

## ౬. గోష్ఠిసమావేశం.

నాగయ్య—ఇంతవరకూ మనకు మనమే చదువుకొంటూ చర్చించుకొంటూ కాలక్షేపం చేస్తున్నాం. ఉద్యోగం విషయంలో నాకు మానాన్నగారికి జరిగిన సంగతులు మీకు తెలుసునుగదా. చదువు సంధ్యలు చెప్పించి పెంచి పెద్దవాళ్లను చేసిన తల్లిదండ్రులను యెదిరించడం చాల

అధర్మమైన పని. కొంతమంది యువకులు అదేమో ఘన కార్య మనుకొంటారు. కాని ప్రస్తుతస్థితిలో నేను వ్యతిరే కించానంటే, నా స్వలాభం కుటుంబలాభంకంటె సంఘం యొక్క సేవ యెక్కువైందని నాఆత్మ నన్ను ప్రేరేపించడం చేత, దానివల్ల కలిగే కష్టనష్టములన్నీ భరించడానికి యిష్ట పడి యెదురు తిరిగాను. ఒక్కొకప్పుడు ధర్మంకోసం సకలం వదులుకోవలసివస్తుంది. హాయిగా తోటలో కబుర్లతో కాలం గడిపేందుకు సమయం కాదిది. సంఘంలో నూతన చైతన్యం, వికాసం, ఆనందం కలిగే మార్గాలు అన్వేషిం చాలి. ప్రతిమనిషికి చదువుకొన్నా, చదువుకోకపోయినా, ఏదో యింత జ్ఞానం సంపాదించుకోవలెనని, సుఖంగా ఆనం దంగా ఉండాలని కోరిక ఉంటుంది. ఇవి మనోవృత్తులు. కేవలం బాహ్యవిషయాలమీద ఆధారపడి లేవు. కాని యీ వృత్తులను పోషించే మార్గాలు తెలియకా, అవకాశాలు లేకా యివి లోలోపల్నే అణగారిపోయి, మనిషి పశు జీవనంలో పడిపోతాడు. మనిషై పుట్టి, యీవిధంగా వికాసం అభివృద్ధిలేకుండా అణగారిపోవడం చాల దుఃఖకరమైన విషయం. కనుక మనతోడి మనుష్యుల ఆత్మవికాసానికి ఆనందానికి మనం తోడ్పడడం, మన ఆనందానికి మన ఆత్మవికాసానికి మార్గం. సంఘాభివృద్ధి అంతా యిట్టి లం కెలతోనే కూడుకొని ఉంది. మనం సంబంధాలు తెంచుకొని యెవరికి వారమే అయిపోతే క్షీణించడమే కాని వృద్ధిలోకి

రాం. మన కార్యక్రమాన్ని మనం నిర్ణయించుకోవాలె. మీ రందరు నాతో యేకీభవిస్తారని నానమ్మకం.

వెంకయ్య—మీరు సందేహించపనిలేదు. మన గ్రామజీవనంలో పని లేకపోవడమే గొప్ప సమస్య. ఈ పనిలేకపోవడం గ్రామంలో అనేక అరిష్టాలకు కారణంగా ఉంది. యువకులైనవాళ్లు తగినపని లేక కుమార్గాల్లో పడిపోతున్నారు చీట్లపేకలు, జూదాలు, జువ్వాల్లో దిగి కొరగానివాళ్లయి పోవడమే కాకుండా సొమ్ము పాడుచేస్తున్నారు. సంపాదించడం లేకపోగా యింట్లోవి యెత్తుకపోయి జూదాల్లో పెడుతున్నారు. వీటిమూలకంగా వచ్చే కజ్జాలు, విరోధాలు, సంసారాలు సంసారాల్లో అల్లుకపోతున్నాయి. గ్రామాలకి గ్రామాలకీ కక్ష లేర్పడుతున్నాయి. తోటల్లో దొడ్లల్లో జొరబడి కాయ, కసవు కోసుకరావడం, వీనిమూలకంగా పెద్దవాళ్లల్లో కలహా లేర్పడుతున్నాయి. వీళ్లను యీ చెడు పనుల్లోనుండి తప్పించి మంచి కార్యాల్లో ప్రవేశపెట్టడం నాకు చూస్తే అన్నిటికన్న ముఖ్యమైన పనిగా తోస్తున్నది.

నరసింహారావు—నీవు చెప్పింది నిజమే కాని, మార్గం యేమిటి? వాళ్లు ఘటానఘటికులు. వాళ్లు మనతో కలవనే కలవరు.

నాగయ్య—వెంకయ్యా! నీవు సూచించింది చాల ముఖ్యమైన విషయం మాత్రమే కాదు. నరసింహారావన్నట్లు చాల కష్టమైంది కూడాను. వాళ్లు మన బోధలకు మాటలకు లోబడే రకం కాదు. మనమేదైనా మంచి కార్యక్రమం యేర్పాటు

చేసికొని పని చేస్తుంటే, వాళ్ళకు కూడా మంచిబుద్ధి పుట్టి మనలో కలవాలి. అప్పుడే వాళ్లు చెడుమార్గాలు వదిలి మంచి మార్గాల్లో పడతారు.

సుబ్బయ్య—వీళ్లందరిని కూడకట్టుకరావడానికి యేదైనా ఒక అవకాశంకల్పించాలి. యువకులందరికి ఒకసంఘం యేర్పాటు చేదాం; దానిలో అందర్ని చేర్చుకొందాం. దానితరఫున యేదైనా పని ప్రారంభిస్తే బాగాఉంటుంది. అప్పుడు అందరికి శ్రద్ధ యేర్పడుతుంది.

నాగయ్య—నీవు చెప్పింది బాగానే ఉంది. మనం చేయవలసిన పనికూడా నిర్ణయించుకొంటే వాళ్లకూ్కడా నచ్చచెప్ప వచ్చు.

వెంకయ్య—మనం యిదివరలోమన దేశానికి సంబంధించినవ్యావసాయిక, పారిశ్రామిక, ఆర్థిక, సాంఘికాది విషయాల్ని గురించి చదువుకొంటున్నాం. దీన్ని ఒకపాఠశాలగా యేర్పాటుచేస్తే బాగుంటుందేమో.

నాగయ్య—నీది యోగ్యమైన సలహాయే. కాని ఒక పాఠశాల సరిపోదు. రెండుకావాలి. ఒకటి బాగా చదువను వ్రాయను చేతనైనవాళ్లకు; మఱొకటి చదువురాని పెద్దవాళ్లకు రాత్రి పాఠశాల. పిల్లకు చదువను వ్రాయను లెక్కలు మొదటితరగతి వాళ్లు నేర్పే యేర్పాటు. మొదటిరకం వాళ్లకు ప్రాపంచికజ్ఞానానికి ముఖ్యంగా మనరైతుజీవనానికి, వృత్తులకు, సాంఘికజీవనానికి సంబం-

ధించిన ఉపన్యాసాలు, పత్రికాపఠనం మొదలైనవి యే ర్పాటుచేదాం. చాలమంది కుర్రవాళ్లు సిగరెట్లు, కాఫీ హోటళ్లు మరిగి శరీరారోగ్యం చెడకొట్టుకొంటున్నారు. బుద్ధివికాసంతోపాటు శరీరవికాసంకూడా అవసరమే. ఈ సంగతి చదువుకొన్నవాళ్లే గ్రహించడంలేదు. కాబట్టి మనం శరీరవ్యాయామశాఖ ఒకటి యేర్పాటుచేదాం. దీనిలో సీతయ్యకు మంచిసరదా. సీతయ్య అల్లరిజట్టుకు నాయకుడు. సీతయ్యను మనం పిలిచి ఈ పని నీవల్ల కావాలంటే కొండెక్కుతాడు. మనతో జాగ్రతగానే ప్రవర్తిస్తాడు. దానితో ఊళ్లో సగం అల్లరి చస్తుంది. మనం వీళ్లను వశంచేసుకో వలెనంటే మన మెంతో జాగ్రతగా, పరస్పరం యెంతో మర్యాదగా, అన్యోన్యంగా మెలగటం అభ్యాసం చేసుకో వాలె. వ్యర్థప్రసంగాలు పనికిరావు. ఇతర్లనుగూర్చి నిందలు చెప్పుకోటం ఒకగొప్ప దురభ్యాసం. మనదగ్గర యేమాత్రం లోపం కనిపించినా వాళ్లు దాన్ని అవకాశం తీసికొని స్వేచ్ఛగా విహరిస్తామంటారు. మనం సంస్కారం చేదామని బయలుదేరుతున్నాం గనుక ముందుగానే హెచ్చరిస్తున్నా. కేవలం చదువే అయితే విసుగ్గా ఉంటుంది. కొంత సరదా అయిన పని ఉండాలి. ఈమధ్య ప్రభుత్వంవారు మద్యపానం నిషేధంలో కొంత అభిమానం ప్రకటించారు. ఱెంపరెన్సు బోర్డులు జిల్లా కొకటి యేర్పాటుచేశారు. ఈఅవకాశం తీసికొని యీూహపంగా కొంతపని ప్రారంభిస్తాం.

వెంకయ్య—ఇది చాల ముఖ్యమైన పనే. మన కమ్మసంఘంలో త్రాగుడులేదు గాని మన గ్రామంలో యితర కులాలవాళ్లు, ముఖ్యంగా మాలవాళ్లు, త్రాగుడువల్ల నాశనమైపోతున్నారు. వాళ్లు సంపాదించేదానిలో ముప్పాతిక తాగడానికే సరి పోతుంది. మిగతా దాన్తో సంసారం గడవక కడుపులు కాల్చుకొని కయ్యాలతో కాలం పుచ్చుతారు.

నరసింహారావు—మనం టెంపరెన్సువర్కు తప్పకుండా చేదాం. ప్రచారానికి కావలసిన కరపత్రాలు పైనుంచి తెప్పించుకోవచ్చు.

నాగయ్య—పూర్వం బస్తీవాసన తగలకముందు వెంకయ్య చెప్పినది నిజమే. ఇప్పుడు మనసంఘ మేమి, ఇతరసంఘా లేమి, మాంసాహారానికి; కల్లు, సారాయి, బ్రాందీలు త్రాగడానికి గాని; సిజర్సు, త్రీకేసిల్సు, గోల్డు ఫ్లేకు కాల్చడానికి గాని; టీ, కాఫీలు సేవించడానికిగాని పూర్తిగా అలవాటు పడ్డారు. అవి లేకపోతే గొప్ప కుటుంబాల్లో లోపంగా యెంచబడుతోంది. విదేశాలనుండి దిగుమతియైన విద్యాధికులను చూచే మనవాళ్లు యీ దురభ్యాసాలు నేర్చుకొంటున్నారు. బస్తీలో పెద్దమనుష్యులయింటికి వెళ్తే తాంబూలాలకు బదులు సిగరెట్లు, టీ, కాఫీలతోను సత్కరిస్తున్నారు. కనుక ఈదుర్వ్యసనాలు సంఘంలో వెర్రితలలు వేయకముందే నిర్మూలించడం అవసరం. దీనికేంగాని పంచములస్థితిమాత్రం చాల దుర్భరంగా ఉంది. త్రాగుడు వాళ్ళకొంపల్ని కూల్చేస్తున్నది.

వెంకయ్య—ప్రచారం మనం యేలాగూ చేదాం అనుకొన్నాం. ఇంకా యేం చేయగలం? వాళ్ళకు వాళ్ళే బుద్ధి పుట్టి బాగు పడాలిగాని.

నాగయ్య—వాళ్ళకు వాళ్లే బాగుపడవలసినమాట వాస్తవమే. కాని మనకు కూడా కొంత బాధ్యత ఉంది. సంఘం శరీరం వంటిది. అన్ని అవయవాలు సరిగా ఉండి పనిచేస్తేనే దేహం సర్వాంగసుందరంగా ఉండి చక్కగా పనిచేస్తుంది. కాళ్లు చేతులు పనిచేయకపోతే మిగిలిన అవయవాలు కూడా శుష్కించిపోతాయి. మాలవాళ్ళు సంఘానికి కాళ్లు చేతులువంటి వాళ్లు. ఇతర అవయవాలు కాళ్లు చేతులకు కావలసిన పుష్టిని ఆరోగ్యాన్ని కలుగజేస్తున్నాయి. గ్రామ జనసంఘంలో ఉన్న మన మందరం ఒకరిమీద ఒకరం ఆధార పడి ఉన్నాం. ఒక కొంప నిప్పు అంటుకొంటే ఇతరకొంపల వాళ్లు మనకేం? అని ఊరుకొంటే అన్ని కొంపలు ఆహుతి అవుతాయి. మాలగూడెంలో ఏ కలరో స్ఫోటకమో వస్తే మనం మనకేం అని ఉపేక్షచేస్తే గ్రామానికంతకు ప్రాకు తుంది. కనుక మనం పంచముల్ని యేవిధంగాను ఉపేక్ష చేయకూడదు. వాళ్ళ ఆదాయం, ఆరోగ్యం, విద్య అన్ని వృద్ధిపొందితేనే గ్రామం సర్వతోముఖంగా చక్కబడుతుంది.

వెంకయ్య—చెట్టు ఎక్కేవాళ్ళను ఎంతా కని పైకి తోస్తాం? వాళ్లు స్వశక్తిచేత పైకి రావాలె.

నాగయ్య—నిజమే; 'మనం బాగుపడవలె'నని వాళ్లకు బుద్ధి పుట్టి పరితాపం కలిగేటంతవరకు మనం కొంత ప్రోత్సాహం చేయవలసి వుంటుంది. మనతోపాటే వాళ్ళను చేర్చుకొంటే వేరే చేయవలసిందేమి వుంటుంది? ఇప్పుడు మన వీరాస్వామిని చూడండి, ఎలా వున్నాడో.

వెంకయ్య—అదే, నే చెప్పేదీని. అతనిమోస్తరుగా అందరు చదువుకొని బాగుపడవద్దన్నామా?

నాగయ్య—అతను చిన్నప్పటినుండి మాయింటికి వస్తూ పోతూ నాతో స్నేహం చేస్తుండేవాడు. నాచేతనైన సహాయం నేను చేస్తుండేవాడిని. ఆలాగే, బుద్ధిమంతుడేమో! ట్రియినింగు ప్యాసు అయి మేస్టరీ చేస్తున్నాడు. ఇదేవిధంగా మనతో కొంత సంబంధం, సాహచర్యం యేర్పడితే వాళ్లు సంస్కారం పొందుతారు.

నరసింహారావు—మన గోష్ఠిలో వీరాస్వామిని చేర్చుకొని అతనిద్వారా కొంతపని జరిపించవచ్చును. ఒకరాత్రిపాఠశాల యేర్పరిచి పగలుపనిచేసికొనే పెద్దకుర్రవాళ్లకు చదువు చెప్పించవచ్చు.

నాగయ్య— అవును. వీరాస్వామిని దానికి యేర్పాటుచేసి మనంకూడా సహాయం చేదాం. అతనికి పేరు, పలుకుబడి ఉంది.

వెంకయ్య— అతను వాళ్లవాడే గనుక వాళ్లకు యెక్కువ విశ్వాసం కలుగుతుంది. అతన్ని మనలో చేర్చుకోవటంచేత మిగిలిన

వాళ్లకు బాగుపడవలె ననేడి ప్రోత్సాహంకూడా యేర్పడు తుంది. పైగా అతను చాల బుద్ధిమంతుడు, యోగ్యుడు.

నాగయ్య— పంచముల విషయంలో ఈమాత్రంగా మనం ప్రారంభిస్తే క్రమంగా అది యేవిధంగా వృద్ధిపొందుతుందో చూదాం తర్వాత?

లక్ష్మయ్య—ఖద్దరువిషయంలో మనం చేయతగ్గదేమో అది కూడా నిర్ణయించుకొంటే బాగుంటుంది. గాంధిగారి ప్రబోధమూలంగా దేశంలో ఖద్దరువాడుక విస్తరిస్తున్నది. మన ఊళ్లోకూడా చాలమంది రాటాల్తో నూలువడుకుతున్నారు. బాగానే తయారవుతున్నది. మనచుట్టుప్రక్కల నూలు మనమే నేయించి వడికినవాళ్లకు బట్టలు అందచేస్తే ఖద్దరు బాగా వ్యాపిస్తుంది. కనుక రెండుమూడు మగ్గాలు పెట్టించే యేర్పాటు కావాలె.

నాగయ్య—ఆ విషయంలో నేను నీతోపూర్తిగా యేకీభవిస్తాను. ఆ పనియావత్తూ నీవే చూడు. మనతోట్లో రెండుపాకలు వేయించు. జగ్గయ్యపేట, లేక పల్నాడుప్రాంతాల్లో నుండి రెండు మూడు నేతకుటుంబాలు వచ్చే యేర్పాటు చూడు. మనప్రస్తుతకార్యక్రమం యీమాత్రంగా ఉంటే ముందు ముందు అ దేరూపంగా వృద్ధిపొందుతుందో చూచుకోవచ్చు.

---

## ౭. యువజన కృషివిద్యాలయము.

నాగయ్య మిత్రులతో ప్రారంభించిన గ్రంథపఠనము నెమ్మదిగా యువజన కృషివిద్యాలయంగా మారింది. దీనికి సాలుకు రెండు సమావేశాలు. ఉగాదిసమావేశం మార్చి, ఏప్రిలు, మే నెలలలోను; దసరాసమావేశం సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు నెలలలోను జరుగుతాయి. ఒక్కొక్క సమావేశానికి 40 మంది విద్యార్థులను చేర్చుకుంటున్నారు. భోజనాది వసతులకయ్యే ఖర్చులు విద్యార్థులే భరించాలి. చదువు ఊరికేనే చెప్తారు. యోగ్యులైన బీదవిద్యార్థులకు భోజనం కూడా ఉచితంగానే పెడ్తారు. చుట్టుప్రక్కల రైతులు దీని వుపయోగం గ్రహించి చాల సహాయం చేస్తున్నారు. వంటలో మామూళ్ళు యేర్పరిచారు. జిల్లాబోర్డుకూడా గ్రాంటు యిస్తున్నది. ప్రభుత్వం 'తమ ఉద్యోగులు దీనికి సహాయం చేయవచ్చు'అన్నారు. ఆరోగ్య, వ్యవసాయ, పారిశ్రామిక, సహకార శాఖలవారు వచ్చి ఉపన్యాసాలు యిస్తున్నారు. ఇవిగాక మామూలు గ్రామజీవితాని కవసరమైన విషయాలు బోధించటానికి కూడా యేర్పాటు జరిగింది. లెక్కలు, అకౌంటు వుంచుట, బ్యాంకు వ్యవహారాలు, సర్వేయింగు, ఇరిగేషన్ విషయాలు, భూసారనిర్ణయం, పల్లం మెరకపంటలు, పండ్లతోటలు, కూరతోటలు, వీనికి కావలసిన నానారకపు ఎరువులు, వానిని తయారుచేయు పద్ధతులు, వడుకుట, నేయుట, నానారకపు చాపలల్లుట, బుట్టలల్లుట, కోళ్లను మేకలను తేనెటీగలను పట్టుపురుగులను

పెంచుట, పశుపోషణము, పశుచికిత్స, బెల్లము తయారు చేయుట మొదలగునవి బోధిస్తున్నారు. ఈ తరగతులకు బాగా చదువను వ్రాయను చేతయిన యువకులను మాత్రమే చేర్చుకొనుచున్నారు. రాజకీయాలు, ఎలెక్షనులు, ఓటింగుపద్ధతులను గూర్చికూడా ఉపన్యాసా లివ్వబడుతున్నాయి. చరిత్ర, భూగోళము, భౌతికశాస్త్రాలను గూర్చి చెప్పుతున్నారు. ఈ విధంగా ప్రజల విజ్ఞానవ్యాప్తికి, యువజనుల శీలసంరక్షణకు, సహకారం సంఘీభావం వృద్ధిపొందడానికి, పరస్పరక్షేమాభివృద్ధికి యీ విద్యాలయం కేంద్రమైంది. ప్రజల ఆదరణ, ప్రభుత్వసహాయం బడసి విద్యాలయం వృద్ధిపొందుతోంది.

నాగయ్య నిరుపమానమైన సేవ, త్యాగం, నిరాడంబరమైన జీవనం, అందరిని ఆకర్షిస్తున్నది. విద్యాధికులు, దేశసేవానిరతులు, ఉద్యోగు లెందరెందరో దీన్ని దీవించి ప్రోత్సాహపరుస్తున్నారు.

ఇచట కార్యక్రమం ప్రత్యూషాన్నే ప్రార్థనతో ప్రారంభమవుతుంది. పిమ్మట నిత్యకృత్యాలు తీర్చుకొంటారు. తర్వాత 7½ గం — 10½ గంటలవరకు పాఠములు నడుస్తాయి. 11 గం. భోజనం, పత్రికా పఠనం. 12-2½ గం. చేతిపనులు, 2½ - 5 గం. ఉపన్యాసాలు, 5 x 7 వరకు ఆటలు, విశ్రాంతి. 7 x 8 వరకు భోజనం, 8 x 9 సత్సంగకాలక్షేపం.

---

## ౮. సాంఘిక సేవ.

విద్యావ్యాప్తితోబాటు సాంఘికసేవకూడా నడుస్తూనే వుంది. గ్రామ పారిశుద్ధ్యమును గూర్చి, సామాన్య వ్యాధులు, వాని నివారణ, చికిత్సలనుగూర్చి ఉపన్యాసాలు, మ్యాజిక్ లాంతరు బొమ్మల ప్రదర్శనం వారాని కొకసారి ఊళ్లో గుడివద్ద జరుపుతున్నారు. ప్రజల ప్రాపంచిక జ్ఞానం వికసింపచేయడానికి ప్రపంచంలోని చిత్రాలనుగూర్చి, గొప్ప గొప్ప పట్నాలను గూర్చి, ఫ్యాక్టరీలు, పరిశ్రమలు ప్రకృతి దృశ్యాలను గూర్చి లాంతరు బొమ్మల ఉపన్యాసాలు యిస్తున్నారు. తోటలోని ఉపన్యాసాలకు కూడా గ్రామస్థులు తరుచు వచ్చి వింటుంటారు. ఈ నిరంతర విద్యావ్యాసంగంవల్ల మునుపటివలె కుటాలోచనలు,కుతంత్రాలమీదికి, పుక్కిటి పురాణాలమీదికి ప్రజల బుద్ధి పోవటంలేదు. గ్రామస్థుల్లో ఐకమత్యంఉంటే యెట్టి ఘన కార్యాలు సాధించవచ్చునో విదేశాల్లోని గ్రామాభివృద్ధి చూపించే బొమ్మల పటముల ద్వారా బోధించేవాళ్లు. గ్రామంలో కట్టుబాటుఉంటే పంచాయతీలు, బోర్డులు గ్రామ సౌభాగ్యానికి యేలా తోడ్పడగలవో చెప్పేవాళ్లు. ఈప్రబోధం మూలంగా నెమ్మదిగా పార్టీ నాయకుల పలుకుబడి తగ్గిపోవడం కక్షలంటే అసహ్యం మొదలుపెట్టింది. పంచాయితీద్వారా ఊళ్లో చెరువు మరమ్మతు చేయించారు. కూలిఖర్చులుచేపలవేలంవల్ల, బోర్డు గ్రాంటువల్ల వచ్చాయి. రైతు బిడ్డలు స్వంతబండ్లతో మట్టి తోలేరు. స్కూలుకూడా బాగుపడ్డది. ఇదివరకు మేస్టర్లు పార్టీ గుసగుసల్లో చేరి చదువు చెప్పేవాళ్లుకారు. పైగా పెద్ద

వాళ్ళకు శ్రద్ధ ఉండేదికాదు. నాగయ్యావిద్యాప్రచారం మొదలు పెట్టిన తర్వాత మేస్టర్లకు చదువు యెగకొట్టడానికి వీలుగా లేదు. పిల్లవాళ్లకు కూడా చదువులో శ్రద్ధ యేర్పడింది.

నాగయ్యా తన అనుచరులతో మాలపల్లెలకు, కూలి వాళ్ల గుడిసెలకు వెళ్లి మద్యపాననిషేధప్రచారం చేసేవాడు. జాతర్లు, బలులు, కొలుపులు పేరుపెట్టి తాగడం, నోరులేని జంతువులను వందలకొలది చంపడం ఘోరపాపమని బోధించే వాడు. జూదాలు, కోడిపందాలు కొంతవరకు తగ్గినాయి. కల్లు, సారాయి అనుకంకూడా తగ్గిపోతోంది. దెబ్బలాటలు, దొంగ తనాలు, చార్జీలు సన్నగిలినాయి. బీదసాద కూడా గుడ్డ కలిగి చల్లగా ఉంటున్నారు.

ఈ ప్రచారానికి నాగయ్యా ఒకబండియేర్పాటుచేశాడు. దానిచుట్టు నిషేధప్రచార పటములు, నీతివచనాలు అతికిం చాడు. దానిలో ఒకగ్రామఫోను, మ్యాజికులాంతరు యేర్పాటు చేశాడు. పొద్దుకూకిన తర్వాత ఆబండిని బయలుదేరదీసి మాల గూడానికో, ఉప్పరగూడానికో, లేక దగ్గరలో మరొకపల్లెకో వెళ్లేవాళ్లు. ముందు గ్రామఫోనుపాటలు సాగించేటప్పటికి జనం పోగయ్యేవాళ్లు. తర్వాత బొమ్మలపటాలు చూపించి త్రాగుడు దురభ్యాసంవల్ల కలిగే ధననష్టం, దెబ్బలాటలు, తిండిలేకపోవడం వీటిని మనస్సు కరిగేటట్టు బోధించేవాళ్లు. దురభ్యాసాలు వదలి, సొమ్ము పొదుపుగా వాడుకొంటూ పరిశుభ్రంగా జీవిం చడం, మంచి బట్టలువేసికొంటూ సంఘంలో మర్యాదగా బ్రతి

కడం నేర్చుకొంటేగాని అస్పృశ్యతాదోషం తొలగిపోదని చెప్పేవాళ్లు. చివరకు మ్యాజికులాంతరు బొమ్మలు ద్వారా మంచినీతులు బోధించి, ప్రపంచంలోని తమాషాలు చూపించి ఉత్సాహం కలుగజేసేవాళ్లు.

ఈ ప్రబోధంమూలకంగానే గాక వీరాస్వామి ఋజు ప్రవర్తనవల్లను, నిరంతర కృషివల్లను కూడ గూడెంలో కొంతబలగం యేర్పడింది. నాగయ్య పంచమోద్ధరణకొరకు యేది తలపెట్టినా దానికి వీళ్లు సహాయపడేవాళ్లు. కొంతనీతి, ఆత్మగౌరవం కలిగాయి. కేవలం దురహంకారం, దురభిమానం ప్రబలకుండా మొదటినుండి నమ్రత నీతివర్తనకూడ అంకుశంలాగ నాగయ్య ప్రయోగించాడు. అందువల్ల దురభ్యాసాలు వదలలేనివాళ్లు సిగ్గుపడి తిరుగుతున్నారు. ఈవిధంగా అంటు దోషం తొలగడానికి నాగయ్య నిజమైనపునాది వేశాడు.

ఈ సమయంలో కాంగ్రెసువారు కూడా త్రాగుడు మాన్పించటానికి తీవ్రమయిన ప్రచారంసాగించి కల్లు త్రాగకుండా, కల్లుపాటలు పాడకుండా పికిటింగు, సాంఘిక బహిష్కారంమొదలుపెట్టారు. దీంతోగవర్నమెంటుకును కాంగెసుకును గొప్పసంఘర్షణ కలిగింది. అంతటితో ప్రభుత్వంవారు తోకతొక్కిన తాచువలె దండప్రయోగానికి, చండశాసనాలకీ, అరెస్టులకు ఉపక్రమించారు. వీళ్లు వాళ్లు అని విచక్షణ చూడకుండా అందరిమీద విరుచుకపడ్డారు. నాగయ్యకుకూడా హెచ్చరికలు వచ్చాయి. కాని అతను మామూలుగా ప్రచా

రం చేస్తూనేఉన్నాడు. ఇక లాభంలేదని కలెక్టరు నోటీసు జారీ చేశాడు. నాగయ్య తిరిగి జవాబు యిచ్చాడు.

"నేను కాంగ్రెసు ప్రచారకుడను కాను. నేను చాల కాలం నుండి మద్యపాననిషేధప్రచారం చేస్తూఉన్నాను. నేను టెంపరెన్సుబోర్డు మెంబరుగా ఉండిఉన్నాను. నా సేవను యిదివరలో ప్రభుత్వం ఆమోదించి ఉంది. నేను ప్రజాశాంతికి భంగం కలిగించడంలేదు. ముందూ కలిగించను. ఎవరి హక్కులు అతిక్రమించడం లేదు. పికెటింగుకూడా చేయుటలేదు ఈ పద్ధతులలో నాప్రచారం ప్రభుత్వచట్టానికి విరుద్ధంకాదని నా తలంపు."

కాని దీన్ని కలెక్టరు త్రోసివేసితీర్మాడని చెప్తే మాపో నాగయ్యఅరెస్టు తప్పదని చుట్టుప్రక్కలంతా [redacted] పొక్కిపోయింది.

## ౯. అరెస్టు.

వేకువనే నాగయ్య ప్రార్థనాదికములకు లేచాడు. ఆయన వెంటనే సుశీల కూడా లేచి ప్రార్థనకు కావలసిన యేర్పాట్లు చూచింది. అవి పాఠశాలరోజులు కావు. నాగయ్య ముఖ్య అనుచరులు వెంకయ్య, నరసింహారావు, సుబ్బయ్య, యితరపని వాళ్లు మాత్రమే ఉన్నారు. వాళ్లందరు లేచి సావడిలో సమావేశమయినారు. గీతములు పాడిన తర్వాత నాగయ్య ప్రార్థన

చేశాడు. పిమ్మట స్నేహితుల నుద్దేశించి 'స్నేహితులారా! మనం ఈశ్వరసేవయందు నియుక్తులమై ఉన్నాం. ఇదివరలో మన కనేక అంతరాయములు ఆప్తబంధువులనుండి గ్రామస్థుల నుండి వచ్చినాయి. వాని నన్నిటిని ఓరిమితో భరించటంచేత నే జయించినాం. ఇప్పుడు మనం ప్రభుత్వం ఆగ్రహానికి గురియైనాం. వారి కిప్పుడు కాంగ్రెసుతో సంఘర్షణ వచ్చింది. వారు సకల ప్రయత్నాలచేత తమ అధికారాన్ని, నిలువబెట్టుకో డానికి చూసితీర్తారు. వారిప్రయత్నాలకు మనవలన అభ్యంతరం కలుగుతుందని తోస్తే మనని వారు అణచివేయ చూట్టం సహజమే. బుద్ధిపూర్వకంగా మన మెట్టి అభ్యంతరం కలిగింపక పోయినా, మనం అజ్ఞానంనుండి మేల్కొడమే వారు ప్రజా శక్తివిజృంభణముగా తలంపవచ్చును. ఇతరులకు బాధకరము కానివిధమున ప్రతిమనిషి, ప్రతిసంఘం అభివృద్ధిలోనికి వచ్చేం దుకు ప్రయత్నించటానికి సహజమైన హక్కు కలిగిఉంది. ఆ హక్కును రక్షించుకోవడం న్యాయమనక తప్పదు. మనకు అసహాయోద్యమంతో సంబంధం లేకపోయినా మన సాంఘిక, ఆర్థిక, విద్యా సంస్కారయత్నాలే ఈ ఒడిదుడుకు రోజుల్లో ప్రభుత్వానికి అనుమానానికి కారణా లవుతున్నాయి. వాళ్ల నీడను చూచి వాళ్లే అనుమానిస్తున్నారు. ముందువలె యిప్పుడును మనం సహనం పూనవలసి ఉంటుంది. నేను బంధింప బడుట నిశ్చయం. మీ రీ సందర్భంలో యేమీ తొందర పడవద్దు.ఖద్దరు పనిమామూలుగా చేస్తుండండి. మద్యపాన నిషేధ ప్రచారం ఆపండి. రాత్రి పాఠశాలలు జరిగించండి. యువజన

కృషివిద్యాలయ సమావేశాలు యేలాగూ నిలుపవలసిందే. ఉపన్యాసాలు ఆపండి. భయంగాని, ఉద్రేకంగాని చూపవద్దు. మీమీ కార్యాలు మీరు శాంతంగా జరుపుకోండి." అని ప్రసంగించాడు.

పక్షుల కలకలం హెచ్చుతోంది. గ్రామమంతా మేల్కొన్నది. ప్రజలు తమతమ కార్యాలకు వెళ్లుతున్నారు. ఇంతలో తోటవైపున 'బస్సు'వస్తున్న చప్పుడు వినిపించింది. అందరు తొంగిచూచారు. బస్సు వచ్చి తోటముందర నిలిచింది. లాటీలు ధరించిన కాకిదుస్తుల పోలీసుదళం క్రిందకి దిగింది. ఇనస్పెక్టరు, ఇద్దరుకాన్‌స్టేబిల్సు తోటలోపలకి వెళ్లారు. ఇంటిని సమీపించి "నాగయ్యగా రున్నారా?"

'ఆఁ, ఉన్నాను' అని నాగయ్య బయటికి వచ్చాడు.

'మీకు అరెస్టువారం టున్నది.'

'సరే, నేనూ సిద్ధ మగుచున్నాను; కొంచెము అవకాశ మిచ్చెదరా?

'అలాగే, త్వరగా సిద్ధంకాండి.'

'మీరు కాఫీ పుచ్చుకోటానికేమీ అభ్యంతరం లే దనుకొంటాను.

ఏమీ లేదు.?'

ఇంతలో నాగయ్య తన కవసరమైన బట్టలు, పాత్రలు, పుస్తకాలు తీసికొని సిద్ధమైనాడు. ఇన్‌స్పెక్టరుగారూ కాఫీ పుచ్చుకున్నారు.

ఇంతలో రోడ్డంతా నేల యీనినట్లు జనంతో నిండి పోయింది. జనాన్ని చూచి పోలీసులు చాల నెమ్మది వహించారు. నాగయ్య బస్సుదగ్గరికి వచ్చేటప్పటికి ఖద్దరు మాలలు, పుష్పమాలలు వర్షించాయి. ఆజనసమూహంలో ప్రజల్ని నిరోధించటానికి పోలీసులకు కష్టమనిపించింది. బస్సు ముందుకు సాగడానికి వీల్లేకుండా ఉంది. అప్పుడు నాగయ్య లేచి ప్రజలకు నమస్కరించి "మహాజనులారా! ప్రభుత్వంవారు నాపరిచారకమును గ్రహించిరో గ్రహించకనో నాకు చెఱసాలలో విశ్రాంతి ఇచ్చి గౌరవింపదలచినారు. కావున నన్ను మీరు ఆశీర్వదించి పంపుడు. మీరు భేదభావముల మరచి గ్రామాభివృద్ధికి సహాయభూతమగు నిర్మాణకార్యక్రమము సాగింపుడు, మాకు మార్గం వదలండి.' అని విన్నవించాడు. బాట యేర్పడింది; కారు సాగిపోయింది. కాని బెజవాడ చేరేవరకు రోడ్డుయిరుప్రక్కల జనం తండోపతండాలుగా నిలిచి జేజేధ్వానములు చేస్తూనేఉన్నారు.

బస్సు బెజవాడసబ్ జైలు చేరింది.

---

## ౧౧ విచారణ - శిక్ష.

సబ్ కలెక్టరాఫీసులో సబ్ కలెక్టరుగారి యెదుట విచారణ ప్రారంభమైంది. కోర్టుఆవరణ జనంతో కిటకిట లాడుతోంది.

'నీవు కాంగ్రెసుకు చేరిన అసహాయవాదివేనా ?'

'కాదు'

'కాంగ్రెసుఅసహాయవాదివని యేమి?'

'నాకు తెలియదు'

'కాంగ్రెసువారు కల్లు త్రాగకూడదని ప్రచారం చేస్తున్నారా?'

'చేస్తున్నారు'

'నీవుకూడా చేస్తున్నావా?'

'చేస్తున్నాను'

'కాంగ్రెసువాలంటీర్లు పికెటింగు చేస్తున్నారా?'

'చేస్తున్నారు'

'నీవు చేస్తున్నావా?'

'నేను చేయడంలేదు.'

నీవు యెక్కడ ప్రచారం చేస్తూవున్నావు.

'మాలపల్లెలలోను, కూలివాళ్లగుడిసెలవద్దనూ?'

'నీవు యెచట నిలవబడి ఉపన్యాసాలు యిస్తున్నావు?'

'వాళ్ల యిళ్లకు సమీపంగా ఉన్న ఖాళీస్థలాల్లో నిలబడి ప్రచారం చేస్తున్నాను.

'అవి గవర్నమెంటుబాటలు కావా?'

'కొన్నికావచ్చును; అన్నీ కావు.'

'రాజవీథుల్లో ప్రజల రాకపోకలను నిరోధించే లాగున గుంపును చేర్చుకొని ఉపన్యాసా లివ్వడం శాసనవిరుద్ధంకాదూ?'

'ఆబాటలు యెక్కువ రాకపోకలు కలవి కావు. ఇదివరలో ఆలా చేస్తూనే ఉన్నాం. ఉద్యోగస్థులు వచ్చినప్పుడు కూడా అట్టిస్థలాల్లో సభలు జరుపుతూనే ఉన్నాం?

'ఇట్టిప్రచారం చేయకూడ దని నీకు జిల్లామేజస్ట్రీటుగారి నోటీసు వచ్చిందా?

'వచ్చింది.'

'నీవు దాన్ని అతిక్రమించటానికి యేల పూనుకొన్నావు?

'నేను చేసే పనిలో శాసనవిరుద్ధం యేమీ లేదు. కలెక్టరుగారి నోటీసు శాసనానికి లోబడి లేదు. అందువలన నేను నాపనిని కొనసాగించుచునే ఉన్నాను.

'ఇది శాసనోల్లంఘునంకాదా?

కాదు, కలెక్టరు నోటీసు శాస్త్రసమ్మతం కాదు.

'నీవు బుద్ధిపూర్వకంగా ప్రభుత్వాజ్ఞలను అతిక్రమింప దలచినావు గనుక నిన్ను సత్ప్రవర్తనకు 107 వ సెక్షన్ క్రింద జామీను యివ్వవలసినదిగా కోర్తున్నాను.'

"నేను జామీను యిచ్చుటకు సిద్ధంగా లేను."

'నీవు సిద్ధంగా లేకపోయిన 123 సెక్షన్ క్రింద 1 సంవత్సరం విడిఖైదుకు శిక్షార్హుడ వగుచున్నావు. కనుక నిన్ను ఆ

ప్రకారం యేల శిక్షించకూడదో రుజువుచేసుకో. ఉత్తర సాక్ష్యం డిఫెన్సు పెట్టుకోవచ్చు.'

'నాకు ఉత్తరసాక్ష్యంగాని, డిఫెన్సుగాని లేదు. నేను చెప్పదలచిన సంగతులను స్వయముగానే నివేదింపదలచినాను.

"నేను అసహాయవాదిని కాను. రైతుసేవకుడను. వారి నైతికార్థిక విద్యాభివృద్ధియే నాజీవితలక్ష్యం. దాన్ని సాధించ టానికి నాశక్తికొలది పాటుపడుతున్నాను. ఈ సేవయందు నాకు గవర్నమెంటువారుకూడా సహాయం చేస్తున్నారు. నా కవసరమైనప్పుడు ప్రభుత్వసహాయం నేనపేక్షిస్తున్నాను. ఖద్దరు ఉత్పత్తికి నేను పూర్తిగా కృషిచేస్తున్నాను. రైతులకు విరామ కాలంలో ఆర్థికంగా తోడ్పడే చిన్నచిన్న వృత్తులను ప్రవేశ పెట్టటానికి ప్రయత్నం చేస్తున్నాను. కూలి నాలి చేసుకొనే పాటకప్రజనుల యోగక్షేమానికి మద్యపానము గర్భశత్రువన్న సంగతి సర్వజన విదితము. దాన్ని నిర్మూలించటానికి ప్రభుత్వం కూడా సహాయపడుతూనె ఉంది. ప్రజలకు రాజకీయ స్వాతం త్ర్యము సంపాదింప దీక్షవహించిన కాంగ్రెసు తన కార్య క్రమంలో, ఖద్దరు మద్యపాననిషేధం చేర్చుకొన్నంతమాత్ర మున అవి దూష్యములు కాజాలవు. కాంగ్రెసుకు జెందని వారుకూడ వానిని చేస్తూంటే వారు దోషులు కానేరరు. నిర పాయకరమైన ఈఆర్థికోద్యమములను ప్రభుత్వము నిషేధింప కుండుగాక యని నేను కోరుచున్నాను.

నేను కలెక్టరుగారి ఉత్తరువును ఉల్లంఘించినానని నేర మారోపింపబడినది. కలెక్టరుగారి ఉత్తరువులోని పికెటింగు

వగైరా నేరములను నేను చేసియుండకపోవుటచే ఆ యుత్తరువు నన్నెట్లు బంధింపగలదో తెలియుటలేదు. నేను ప్రభుత్వశాసనముల నెన్నడు అతిక్రమించియుండలేదు. కనుక నిర్దోషిని అగుచున్నాను. కోర్టువారు అందుకు భిన్నముగా తలచి నన్ను దోషిగ నెంచి శిక్ష విధించుచో సంతోషముతో స్వీకరించెదను. ఇవియే నేను చెప్పదలచిన సంగతులు."

కోర్టువారు నాగయ్యను దోషిగ నెంచి ఒక సంవత్సరము ఖిడిఖైదు విధించి వేలూరుజైలుకు పంపివేసిరి.

# రెండవ భాగము.

## ౧. సంసార గోష్ఠి.

నాగయ్యను అరెస్టు చేస్తారని గ్రామంలో పొక్కగానే రామయ్య తోటకు పరుగెత్తాడు. కలెక్టరు ఉత్తరువు ప్రకారం మద్యపాన నిషేధ ప్రచారము మానేయవలసిందని అనేక విధాల చెప్పాడు, బతిమాలాడు, బెదరించాడు. కాని నాగయ్య వినలేదు. కలెక్టరు ఉత్తరువు అశాస్త్రీయమైంది గనుక తాను ద్రోహిని కాజాలనని చెప్పాడు నాగయ్య. ఇకలాభం లేదని తెలిసి పోయింది రామయ్యకు. తర్వాత విచారణలో కూడా రామయ్య యేమిజోక్యం కలిపించుకోలేదు. నాగయ్యకు కాంగ్రెసుతో సంబంధం లేకపోయినా, తన ఉద్యోగస్థుల ప్రాపకానికి యేంచేటు మూడుతుందో అనిరామయ్యకు చాల భయంకలిగింది. దానికి ఒకటే మార్గం ఆలోచించాడు. నాగయ్య రెండేళ్ళనుండి తనతో కలిసి ఉండక వేరే ఉంటున్నాడనియు, తనకు అతనికి యేవిధమైన సంబంధం లేదనియు పత్రికల్లో ప్రకటించాడు. దీనితో ప్రాణం కొంచెం కుదటపడ్డది. అయినా హార్బరింగు స్కీము క్రింద తన మీద కేమన్నా వస్తుందేమో అని భయం. ఎందుకైనా మంచిదని పోలీసు సూపరింటెండెంటు చుట్టూ ప్రదక్షిణమున్నూ పాడిమన్ను అయ్యేటట్టు తిరిగాడు. నానా అగచాట్లు పడ్డాడు. చివరకు 'నీకేం పరవాలే'దని అనిపించుకొని బయట పడ్డాడు.

చదువు పూర్తిఅయి నాగయ్య గ్రామంలోనే స్థిరంగా ఉండడం మొదలుపెట్టి మూడేళ్లు కావస్తున్నది. గుమాస్తా, పాలేళ్లు ఉన్నా ఊడ్పులు, కోతలు, నూర్పిళ్లు వగైరాపనులన్నీ నాగయ్యే స్వయంగా చేయిస్తున్నాడు. సొమ్ముల్యవహారం మాత్రం తనమీద పెట్టుకోలేదు. అదంతా జానకమ్మే చూచు కొంటున్నది. తల్లి చెప్పిన పనిమాత్రం నాగయ్య చేస్తుండే వాడు. రామయ్య తనకు కావలసిన సొమ్ముమాత్రం భార్యను అడిగి పట్టుకపోతుండేవాడు. కొద్దిగా ధాన్యంవ్యాపారం ఉండేది; కొద్దిగా చిల్లరమల్లర యిచ్చి పుచ్చుకునే వ్యాపారం ఉండేది. ఇదంతా రామయ్య ఉత్తరవుప్రకారం గుమాస్తాలు చేస్తూండే వాళ్లు.

కృషి విద్యాలయం ప్రారంభం అయింది మొదలు నాగయ్య దాదాపుగా తోట్లోనే కాపురం ఉంటున్నాడని చెప్ప వలసిందే. తోట ఆదాయం అయిదారువందలు వస్తుంది. అది సుశీలదే. కుటుంబరాబడిలో అది యెప్పుడూ చేరదు. నాగయ్య భార్యసొమ్మే తనస్వంతఖర్చులకు ఉపయోగించేవాడు. బియ్యం పాలు, పెరుగుమాత్రం జానకమ్మ యింటివద్దనుండి పంపేది. చదువు మానుకొన్న తర్వాత యింటిసొమ్ము నాగయ్య యేమి వాడుకోటం లేదు.

ఉద్యోగం విషయంలో తండ్రికొడుకులకు తగాదా వచ్చి నప్పటినుండి, యిద్దరూ యెక్కువచనువుగా అన్యోన్యంగా ఉండ డం మాట్లాడడం జరగడం లేదు. అయినా వేరుపడడం, పంచు కోటం యిటువంటిదేమీ జరగలేదు. తండ్రి తనతో మాట్లా

డక పోయినా, తన కేమీ డబ్బు యివ్వకపోయినా కూడా నాగయ్యకు వేరుపడదామనే ఉద్దేశమే యెప్పుడూ కలుగలేదు. 'నాకు యింత సొమ్ము కావాలి, ఇవ్వ' మని తల్లినిగాని, తండ్రిని గాని నాగయ్య యెప్పుడు అడుగలేదు. నాగయ్యకు విద్యాలయం నడపడానికి చాల సొమ్ము ఖర్చు అవుతూనే ఉంది. కాని ఆ సొమ్మంతా నాగయ్య యితరత్రా రైతుల వద్దనుండి వసూలు చేస్తున్నాడు; ఖర్చుపెట్టు తున్నాడు. స్వంతఖర్చులు మాత్రం తానే భరించుకొంటున్నాడు. ఈ విధంగా కుటుంబ వ్యవహారం నడుస్తోంది.

---

౨. 'తా నొకటి తలిస్తే దైవ మొకటి తలిచాడు.'

తన ప్రభుభక్తిపరాయణతకు మచ్చలేకుండా ఉండాలనీ, పోలీసుతంటా లేకుండా చేసుకోవాలనీ కొడుక్కూ తనకూ సంబంధం లేదని బహిరంగంగా రామయ్య పత్రికల్లో ప్రకటించాడు. నిజానికి ప్రొద్దనలేస్తే గ్లాస్గోమల్లులు కట్టుకొని ఉద్యోగస్థుల ద్వారదర్శనాభిలాషియై తిరిగేవాడైనా, లోపలుండే ఆదుర్దాకొద్దీ యెక్కడేం మచ్చ వస్తుందో అని రామయ్య కొడుకుతో సంబంధము తెగతెంపుచేసుకొన్నాడు. 'కొండనాలిక్కు మందువేస్తే ఉన్ననాలిక ఊడిం' దన్నట్టు పోలీసునిఘాలోనుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తే అప్పులవాళ్ల నిఘాలో పడ్డాడు రామయ్య. తండ్రీకొడుకులకు సంబంధం లేదనంగానే యిద్దరు వేరుపడ్డారు కాబోలని లోకులు అనుకోటం మొదలుపెట్టారు.

పైగా, నాగయ్యతోట్లో కాపురం ఉండడం, యిద్దరికి మాటా, మంతీ, లేకపోవడం మరింత అనుమానానికి కారణమైంది. ఊళ్లో గుసగుసలు బయలుదేరాయి. బాకీదార్లు ఒక రొకరే కబుర్లు పంపడం మొదలుపెట్టారు. రామయ్య, అదిగో ఇదిగో అని తప్పించుకొని తిరుగుతున్నాడు. పాపం! ఎన్నాళ్లని పరగళ్ల పరగళ్ల పట్టుకతిరుగుతాడు. బందరు పోతే అచట ఉన్నారు అప్పులవాళ్ళు; బెజవాడ వెళ్ళినా అచటా సిద్ధమే. ఎక్కడికి పోతే అక్కడే ప్రత్యక్ష మవుతున్నారు అప్పులవాళ్ళు. ఇంటికి వచ్చి గుమాస్తాల్ను లెక్క తేల్చమన్నాడు. రామయ్య యివ్వాల్సినవి పాతికవేలుదాకా ఉన్నాయి; ఆయనకు రావాల్సినవి నాలుగైదువేలున్నాయి. పట్టు పట్టుమని అందరు ఒక్కసారి కక్కమంటె అత నేం చేస్తాడు. 'ఆస్తిఉంది, నెమ్మదిగా తీరుస్తా నన్నాడు. 'నీ కొడుకుకూడా పూచీపడితే ఒప్పుకుంటా' మన్నారు అప్పులవాళ్ళు. నిజానికి నాగయ్యకు యీ అప్పులతో సంబంధములేదు. ఇవి కుటుంబలాభంనిమిత్తంగాని, వ్యాపారం కోసంగాని చేసిన అప్పులు కావు. ఇవి కేవలం జిల్లాబోర్డుయెలక్షనులకు, ఉద్యోగస్థుల సప్లయిలకు, టీపార్టీలకు, ప్రయాణాలకు అయిన ఖర్చులే. కొడుకు అచ్చుకోకపోతే రామయ్య చేసే దేమీలేదు. అచ్చంగా రామయ్యచౌదరీ అంతా భరించవలసిందే. ఆలా చేస్తే రామయ్యకు చిల్లిగవ్వ మిగల్దు సరిగదా, పూర్తిగా ఋణవిముక్తికూడా కాదు. బాకీదార్ల భయం కూడా అదే. మొత్తంమీద రామయ్యపని యిరకాటాన పడ్డది. నాగయ్య జైల్లో ఉన్నాడు.

"మేము పంపకాలు కాలేదని" రామయ్య యెంత చెప్పినా అప్పులవాళ్లు నమ్మలేదు. ఈ అప్పులు కుటుంబానికి సంబంధించినవి కాకపోవటంచేత నాగయ్య భరించడేమో నని వాళ్ల భయం. ఎట్లా నమ్మకం కలిగించడం?

రామయ్యకు యేమీ పాలుపోలేదు. కేవలం డంభానికి, పటాటోపానికి సొమ్మంతా దుబారాఖర్చు చేశా నని రామయ్యకు కొంతవరకైనా మనస్సుకు తట్టకపోలేదు. కొడుకుతో అనవసరంగా పంతగించి మాట్లాడడం మానుకొన్నాడు. ఈ రెండు మూడేళ్లనుండి ఒక దమ్మిడీ డబ్బులు కూడా నాగయ్యకు ఇంట్లోనుండి ముట్టటం లేదు. ఈ స్థితిలో తన అప్పులను కొడుకును భరించమని యేలా అడుగుతాడు? ఎంతో దర్జాగా తిరిగే మనిషల్లా, మూల కూర్చున్నాడు. ఉత్సాహం చచ్చిపోయింది; మనిషి కుంగిపోయినాడు. జానకమ్మ మొగుడి స్థితిచూచి ఖిన్నురాలై పోయింది. ఇదివరకంతా యెంత మొత్తుకొన్నా వినిపించుకోకపోయె. ఇప్పు డేం చేస్తుంది ఆయిల్లాలు మాత్రం? అయినా ఒకనాడు కోడలికి కబురు పంపించింది. సుశీల వచ్చింది.

జానకమ్మ:— అమ్మాయీ, అనుకున్నంత అయింది. వాడు జైలుకు వెళ్లినా, నీవు తోట్లో ఒక్కదానివే ఉంటున్నా, మేము నీకేం సహాయం చేయటం లేదు.

సుశీల—ఏం సహాయం కావాలి? అందరు ఉండనే ఉన్నారు. ఆయన మూడునెలల్లో వస్తారు.

జానకమ్మ—వాడికోసమే యేడుస్తుంటే ఇప్పుడే మీ మామ గారి చిక్కులుకూడా వచ్చి చుట్టుకొన్నాయి. ఆయన యిల్లు కదలటంలేదు. నీళ్లు తాగడంలేదు. బొత్తుగ దిగులు పడిపోయినారు. నా కేందారీ కనుపించడంలేదు.

సుశీల—అత్తయ్యా, మనం దిగులుపడి చేసేదేముంది. అప్పులు యేలాగూ తీర్చకతప్పదుగదా. ఇంకా కాలయాపన చేసిన ప్రయోజనం యేం ఉంటుంది? కాబట్టి తొందరగా ఉన్న అప్పులేవో పొలాలు అమ్మితీర్చేది. దీనికి మీ కొడుకేమీ అభ్యంతరంచెప్పరు. మేము మీతర్వాతవాళ్లంగాని, మీరు కాదని మేము అనుభవించేదిమాత్రం యేంఉంది? మామగారి యిష్టప్రకారం వ్యవహారాలు ఫైసలుచేయ మనండి. ఆయనస్వభావం మీరు యెరుగందా? వారు అన్నిటికి ఒప్పుకొంటారు. సందేహం యెందుకూ?

జానకమ్మ—వాడు అభ్యంతరం పెట్టుతాడని నేను కల్లో కూడా అనుకోను. కాని ఆయనమనస్సునకు ఆయనకే కష్టంగా ఉంది. స్థితిగతులు యిలా వచ్చాయే అని విచారిస్తున్నారు.

సుశీల—వచ్చిందేమో వచ్చింది. ఇంతటితోనైనా ఋణ విముక్తి చేసికొని మనస్సు కుదటపడేసుకోటం మంచిదిగదా.

జానకమ్మ—ఇదిగో మీమామగారుకూడా వస్తున్నారు.

రామయ్య—కోడలు యెప్పుడు వచ్చిందీ?

జానకమ్మ—ఇంతకుముందుగానే.

రామయ్య—ఇంత యిల్లు యిక్కడఉండగా నీవు ఒక్కదానివి అక్కడ ఉండడం మాకు యెంత కష్టంగా ఉందనుకొన్నావు! నాకు తల కొట్టేసినట్టున్నది. పోనీ, పుట్టింటికి పోయినదానవూ కావు; ఇచటికి వచ్చినదానవూ కావు. నలుగురూ, 'ఆపిల్లను యెవరూ ఆదరించారు కా'రంటారు.

సుశీల—నిజమే. కాని నేను అక్కడ లేకపోతే అచట జరిగే పని అంతా తీన్మారై పోతుంది. వారు వచ్చి మళ్ల అంతా మొదలు కెత్తుకోవలసివస్తుంది. అచటమటుకు భయ మేముంది? తోటలో కాపురా లుండనే ఉన్నాయి. ఎప్పుడూ మనుష్యులు తిరుగుతుంటారు. మా అన్నయ్య, వదినెకూడా మాతోనే ఉన్నారు.

రామయ్య—వాడు యెంతచెప్పినావినకుండా లేనిపోనికామాట మంతా పెట్టుకొన్నాడు. ఊరుకు ఊరుకు మనేవాళ్లేగాని తోడు ఉరికేవా ళ్లుంటారా! వాడు జైలుకు వెళ్లాడుగాని మిగతావాళ్లు ఎవరు వెళ్లారు?

సుశీల—అనేకమంది వెళ్లారు. ఇంకా వెళ్లుతున్నారు. కాలపరిస్థి తులు ఆలా వచ్చినాయి.

రామయ్య—నే నేదో వీడిమీద కొండంత ఆశపెట్టుకొంటే అదంతా నిరాశచేశాడు. పోనీ, ఇంట్లో పడిఉంటాడేమో అంటె అదీలేదు. లేనిపోనివన్నీ మీద వేసికొన్నాడు. నా వ్యవహారమంతా చిక్కుల్లో పడ్డది. అప్పులవాళ్లు బాధిస్తు న్నారు. ఎంతచెప్పినా వినరు. వాడిహామీ కావాలంటారు.

సుశీల—వారు రావడానికి కొంత తడ వవుతుంది. ఈలోపుగ కావలెనంటే ఉత్తరం వ్రాసి తెప్పించవచ్చు.

రామయ్య—నా మనస్సంతా పాడైపోయింది. ఒకపిల్లవాడైనా, వాడినిచాలా నిరాదరణచేశాను. తలచుకొంటే నాకు చాల దుఃఖం వస్తున్నది. ఇప్పుడువాడిని యీభారం నెత్తిన పెట్టుకోమని చెప్పటానికి నోరాడడంలేదు. సంపాదించి యివ్వడం పోయింది; చివరకు అప్పులుఒప్పచెప్పాల్సిన గతి పట్టింది.

సుశీల—మామగారూ, మీరు అటువంటి సందేహం పెట్టుకో పనిలేదు. మీతర్వాతవాళ్లం మేము. మీసౌఖ్యం, మీ మర్యాదా ముందు చూడవలసిన బాధ్యత మాది. దమ్మిడీలతో అప్పులన్నీ తీర్చివేస్తామని చెప్పండి. ఆప్రకారంగా వారివద్దనుండి ఉత్తరం తెప్పించవచ్చు.

రామయ్య—నీవు వ్రాయవలసిందేగాని నాచేత్తో నేను ఆలాటి వుత్తరం వ్రాయలేను. వాడు నా మాట యెంత వినకపోయినా, వాడిసౌజన్యత, నమ్రత, ప్రేమ, శాంతం తలచుకొంటే నా కడుపు చెరు వవుతుంది. ఎవర్నైనా పల్లెత్తుమాట అంటాడా; కన్నెత్తి చూస్తాడా? వాడంటే అందరికి యెంత అభిమానం, యెంతప్రేమ! ఉద్యోగస్థులకు కూడా వాడంటే యెంతో ఆదరణ, గౌరవం. నిజంగా వాడు పూర్వజన్మంలో యేదో పుణ్యం చేసుక పుట్టాడు. కాని వాడి కష్టజీవితం చూస్తే నాకు చాల దుఃఖం వస్తుంది. ఉద్యోగం చేయక

పోయినా ఇప్పటికైనా యేదో కొంచెం ఉందిగా! సుఖంగా తిని ఉండకూడదూ? ఎందుకువచ్చినసేవ యిదంతాను? ఎవరు మెచ్చును? ఏం ప్రయోజనం?

---

## ౩. సుశీల కౌశలం.

సుశీల అప్పయ్యచౌదరీగారి పుత్రిక. ఇరవై సంవత్సరాల లేబ్రాయప్పుయువతి. వివాహమై నాలుగైదు సంవత్సరాలైంది. ఒక సంవత్సరం నాగయ్యతోబాటు పట్నంలో ఉంది. నాగయ్య స్వగ్రామం వచ్చి తోట్లో ఉండడం మొదలుపెట్టింది లగాయతు ఆమెకూడా తోట్లోనే ఉంటున్నది. ఆంగ్లభాషా స్పర్శ అంతగా లేదుగాని తెనుగులో మంచి పరిచయమే ఉంది. లోకవ్యవహారాలు గ్రహించటానికి అవసరమైన ప్రాపంచిక జ్ఞానం నాగయ్య ఆమెకు కలుగజేశాడు. పైగా కృషివిద్యాలయోపన్యాసాలన్ని ఆమెకూడా హాజరై ఉండడంచేత ఉన్న జ్ఞానానికి మెరుగుపెట్టట మైంది. బంగారానికి తావి అబ్బినట్లు నాగయ్యకు నిజమైన సహధర్మచారిణియై పేరు సార్థకంచేసుకొంటున్నది. నడిమావనపుజవ్వని యైనప్పటికి విలాసములకై వేగిరపడు స్వభావంగలది కాదు. సదా భర్తృకార్య పరతంత్రయై ఆయన మొదలుపెట్టిన ఉద్యమాలన్నిటికి చేదోడు వాదోడుగా ఉంది. నిరంతరం వాటి సాఫల్యానికై కృషిచేస్తూ ఉండేది. నాగయ్యకు సుశీలయందు పరిపూర్ణమైన నమ్మకం. ప్రతికార్యం యిద్దరూ బాగా సంప్రదించుకొని ప్రారంభించేవాళ్లు.

ఖద్దరువ్యాపారమంతా సుశీలదే. సుశీల జ్యేష్ఠసోదరుడు వెంకయ్య, ఆయనభార్యా ఆమెకు సహకారులు. అంతేకాదు; ఊరిలో నూలువడికే గృహిణులు చాలమంది ఆమెకు పరిచయలే. వారి ద్వారా స్త్రీజనోద్ధరణకు అంకురార్పణ చేయవలెనని సుశీల తలంపు.

ఒకనాడు సుశీల గ్రామంలోని స్త్రీలను తమయింటిలో జరుగు రాట్నలక్ష్మీవ్రతమునకు సరస్వతీపూజకు పేరంటము నకు రావలసిన దని యథావిధిగ ఇండ్లకు వెళ్లి అందరిని పిలి చింది. చుట్టుపక్కల గ్రామాల్లో ఉండే కొంతమంది ముఖ్య మైన వాళ్లనుకూడా పిలిచింది. వారు, వీరు అంతా వచ్చారు. పడమటిలంకనుండి శ్రీమతి జ్ఞానాంబగారుకూడా వచ్చింది.

అది శరత్కాలం. సూర్యుని కిరణాల్లో వెచ్చదనమే గాని తీక్ష్ణత యేమీ లేదు. వనితామణులందరు మూడు గంట లకే తోటంతా మూగారు. గృహప్రాంగణమంతా శుభ్రం చేయబడి ముగ్గులతో అలకరింపబడి ఉంది. చెట్టుచెట్టునుండి పత్ర ఫల పుష్పాలు గల తోరణాలతో అల్లిబిల్లిగ పాలవెల్లి తయారు చేయబడింది. దానిక్రింద రత్నకంబళిని మరపించు ఖద్దరుతివాసిపై చక్కగా అలంకరింపబడిన ఒకరాట్నము, కొన్ని తెనుగు గ్రంథాలు ఉంచబడి ఉన్నాయి. రసాల వృక్ష చ్ఛాయలక్రింద ఖద్దరుధారిణు లయిన యువతులు మునికన్య కలలాగ విహరిస్తున్నారు. ఇంతలో సుశీల, జ్ఞానాంబగారు లోపలనుండి వచ్చారు; మిగిలిన స్త్రీలందరుకూడా వచ్చి చాపల మీద ఆసీన లయినారు.

సుశీల—నేడు మన మందరం యిచట రాట్నలక్ష్మీ వ్రతం, సరస్వతీపూజకొరకై చేరాం. రాట్నం మన గృహలక్ష్మి. అనాదినుండి మనకు వస్త్రములు ప్రసాదించు వరప్రదాయిని. అట్టి రాట్నమును విస్మరించి మిల్లుగుడ్డల మోహంలో పడి దారిద్ర్యం తెచ్చుకొన్నాం. దాన్ని తిరిగి పునరుద్ధరణ చేయటానికి ఒక మహాపురుషుడు అవతారమెత్తవలసి వచ్చింది. మహాత్ముని పిలుపున అటకలమీదనుండి రాట్నాలను క్రిందికి దింపాం. కొద్దో గొప్పో వడుకుతున్నాం. ఈ చేస్తున్న ప్రయత్నం మిక్కిలి అల్పం. రాట్నం మన స్వశక్తికి, ఆత్మవిశ్వాసానికి నిదర్శనం. అందువల్ల వీటిని యింకా యెక్కువగా వ్యాపింపజేయడానికే యీవ్రతం సంకల్పింపబడింది.

ఒక ముసలమ్మ—(పరోక్షంగా) అయ్యో! ఇదేం వ్రతం! మొగుడు ఖైదుకు వెళ్లాడాయె. బ్రాహ్మల్లేరాయె...అన్నది.

సుశీల—మొగుడూ పెళ్లాం పీటలమీద కూర్చోకుండా, బ్రాహ్మలు మంత్రాలు చదవకుండా వ్రతం యేమిటని మా బుచ్చమ్మ అవ్వ ఆశ్చర్యపోతూంది. మన దేశంలో నోములు, వ్రతాలు చాల ముఖ్యమైన ఆచారాలు. చిరకాలంనుండి వస్తున్నాయి. బ్రాహ్మడు వస్తాడు, కలశాలు పెట్టిస్తాడు. తోరాలు కట్టిస్తాడు, కథాకల్పం చెప్తాడు, నాలుగుడబ్బులు పుచ్చుకొంటాడు, పోతాడు. మనం చుట్టాలు పక్కాలను పిలుచుకొని భక్ష్యభోజ్యాదులతో విందు లారగిస్తాం. ఇదీ నోములంటె. నిజానికి, యీ వ్రతాలు, నోములు యెందుకు

చేస్తున్నామో కూడా తెలియదు. దీనివల్ల ధనధాన్యాలు, సుఖాలు కలుగుతా యని చాలమంది ఆశ. ఇది వట్టి మూఢ నమ్మకం, వ్రతం అంటె ఒకధర్మంఆచరిస్తామని, ఒక ఘన కార్యం సాధిస్తామని దీక్షపూనడం. దీక్ష, ఆచరణ లేకుండా వ్రతం యెప్పుడూ ఫలించదు. మన వ్రతాలు వేడుకలు ఆడంబరం యెక్కువ. వానిలో చెప్పబడే ధర్మాలు మన చెవికే యెక్కువ. ఆ ధర్మాలు తెలియకపోయినా, చేయక పోయినా పుణ్యం మాత్రం వచ్చిపడుతుందని పిచ్చినమ్మకం. ఈ అజ్ఞానం పోవాలె. ఇపుడు మనం పూనుకొన్న వ్రతాలు ప్రత్యక్షనిదర్శనంగా యెపుడో కాకుండా యిప్పుడే ఫలితాలు యిచ్చేవి. మనకే కాకుండా దేశానికంతకూ లాభం కలిగించేవి. అందుచేతనే మావారు ఖద్దరు ప్రచారానికి పూనుకొన్నారు. వారికి సహాయం చేయడం యిదివరకు నా ధర్మంగా ఉంది. ఇప్పుడు వారు జైల్లో ఉన్నారు. కాని వారికి అత్యంతప్రీతికరమైన యీకార్యం వ్యాపింపచేసేటప్పుడు వారు నాయందే ఉంటారు. వారిశరీరం జైలుగోడల్లో ఉన్నా, ఆత్మమాత్రం నాలోనే ఉండి నన్ను యీ కార్యానికి పురిగొల్పుతున్నది. ఈ ప్రకారంగా మీ రందరు ఆదరణ చూపడంలో మీరుకూడా నాలోఉండి నన్ను ప్రోత్సాహపరుస్తున్నారు. ఇది నాప్రయత్నంకాదు, దైవ కార్యం. దేశదారిద్ర్యమోక్షానికై సంకల్పింపబడిన యీ మహావ్రత చిహ్నంగా నేడు మీకు యిచ్చే వడుకునూలు తోరాలు ధరించండి, తక్లీలు స్వీకరించండి. ఈమహాక్రతువుకు

కావలసిన అన్నివస్తువులు యిదివరకుకంటె విరివిగా మా సేవాకుటీరం నుండి సప్లయిఅవుతాయి. బట్టలునేయించటానికి వడికినసూలు కొనటానికి, అన్నిటికి యేర్పాట్లు ఉన్నాయి. నేడు మనం పూనిన యీ వ్రతం నిర్విఘ్నంగా కొనసాగటానికి కావలసిన శక్తిని, విశ్వాసాన్ని పరమేశ్వరుడు మనకు ప్రసాదించుగాక యని ప్రార్థిస్తున్నాను.

ఇక. రెండవవిషయం సరస్వతీపూజ. ప్రతిమనిషికి జ్ఞానం సంపాదించాలని కోరికఉంది. దానికి సాధనం విద్య. దాన్ని పురుషులతోపాటు స్త్రీలుకూడా పొందితే గాని సంసార జీవనం సుఖంగా ఉండదు. రెండెడ్లు కలిసి ఈడిస్తేనే బండి సరియైన బాటను నడిచి గమ్యస్థానం చేరుతుంది. లేకపోతే ఒకటి ముందుకు ఒకటి వెనక్కు లాగుతుంటాయి. బండి సాగదు. కనుక మన శ్రేయస్సుకొరకు, సంఘశ్రేయస్సు కొరకు కూడాను, స్త్రీలుకూడా జ్ఞానం పొందాలి. అందువల్లే సరస్వతీపూజ నేడు యేర్పాటైంది. జ్ఞానోపార్జనే జీవిత పరమార్థంగా చేసికొన్న మనజ్ఞానాంబగారు దీన్ని ఉపక్రమించవలెనని ప్రార్థిస్తున్నాను.

జ్ఞానాంబ—నేటి ఉత్సవంలో పాల్గొనే భాగ్యం నాకు కలిగినందుకు నేను చాల సంతోషిస్తున్నాను. ఇవ్విధంగా మీరందరు ఆత్మవికాసంకొరకు దీక్ష వహించడం దేశమునకొక గొప్పశుభచిహ్నం. వ్రతములను గూర్చి మన సుశీలా దేవిగారు చెప్పింది మీ రందరు బాగా గమనించారని నమ్ముతున్నాను. జీవితంతోను నడవడికతోను సంబంధం

లేని చరిత్రలు కేవలం వ్యర్థం. సరస్వతీపూజ అంటె మీరందరు యిచట ఒక సరస్వతీపటమునో, పుదుచ్చేరి బొమ్మనో పెట్టి పూజాపునస్కారాలు చేస్తారని అనుకొని ఉండవచ్చు. దానివల్ల మనకు విద్యావిజ్ఞానం లభిస్తుందా? నేటిపూజ మానసికం. జ్ఞానస్వరూపిణియైన పరమాత్మనే మనం సరస్వతీ అంటున్నాం. మన హృదయ పీఠంలోనే ఆమెకు స్థానం యిచ్చి నేటినుండి ఆమెపాదకమలముల దగ్గర జేరి ఆమెబోధామృతం గ్రోలి నిశ్చయించుకొన్నాం. ఇతర పనులెన్ని ఉన్నా విద్య నేర్చుకొనుట ఒకముఖ్యపనిగా మీ రందరు భావించాలి. పరమజననియైన సరస్వతి మన కందరికి విద్యాబుద్ధులు కలిపి ఆశీర్వదించుగాక.

సుశీల—ప్రపంచ పరిస్థితులు చూస్తే దేశంమీద రోజు రోజూ నూతనమార్పులు వచ్చిపడుతున్నాయి. మనం వానిని అడ్డుపెట్టలేం. కాని వానిని విచక్షణంతో గ్రహించవలసి ఉంటుంది. విచక్షణజ్ఞానం లేకపోతే రెండందాలా చెడిపో తాం. గుణగ్రహణపారీణతాశక్తి ఆడవాళ్లకు కూడా ఉంటేనే మగవాళ్లు ప్రారంభించే నూతన సంస్కారాలకు చేయూత యివ్వటానికి వీలవుతుంది. కనుక మీ రందరు మీపిల్లలను బడులకు పంపటం అశ్రద్ధ చేయకూడదు. గొడ్లను కాయడం, పేడ పిడకలు చేయడంకంటె విద్య నేర్చుకోటం ముఖ్యమని యిప్పటికైన మనం గ్రహించ వలసి ఉంటుంది. గృహకృత్యాలు నిర్వహించుకొనే పెద్ద వాళ్లకు ప్రతిరోజు ఊళ్లో మా యింట్లోనే 12 మొదలు

4 గంటలవరకు చదువు నేర్పుతారు. ఈ పనికి మన సుభద్రమ్మగారికోడలు రుక్మిణి పూనుకొన్నందుకు నాకు చాల సంతోషంగా ఉంది. అంతేకాకుండా పత్రికలు చదవడం, ఇతర మంచి మంచి గ్రంథములు చదవడంకూడా రోజూ ఉంటుంది. దేశమునకు, ప్రపంచానికి సంబంధించిన అనేక విషయాల్ని గురించి మాజిక్ లాంతరు బొమ్మలు, పటములతో ఉపన్యాసాలు యిస్తారు. ఆరోగ్యం, వ్యాధులు, చికిత్సలు, శిశుపోషణ వీటినిగురించికూడా తెలిసినవాళ్లు చెప్పేందుకు యేర్పాటు జరుగుతున్నది. మీరందరు గట్టిగా యీ సరస్వతీపూజకు పూనుకొంటారని నమ్ముతున్నాను.

రుక్మిణి—గ్రామాల్లోనేమి పట్నాల్లోనేమి సరియైన పనిలేకపోవడంవల్ల ఒకరిమీద ఒకరునిందలుమోపుకోడం, చాడీలు చెప్పుకోడం, పోట్లాడుకోడం మనవాళ్లల్లో గొప్పదురభ్యాసం అయిపోయింది. దీనికి అక్షరకట్టవిద్యావ్యాపకం, సత్కాలక్షేపము తప్పితే మరియొకటిలేదు. సుశీలాదేవిగారు పూనుకోటంవల్ల యీకార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుందని వేరే చెప్పవలసిన పనిలేదు.

సుశీల అందరిని, చందనతాంబూలాదులు ఫలపుష్పాలు యిచ్చి సత్కరించింది.

సుశీలచేసిన యేర్పాట్లవల్ల ఖాదీవ్యాపకం విస్తరించింది. చాలమంది నూలువడకడం మొదలుపెట్టారు. చాలమంది స్వంత ఉపయోగానికి నూలువడుకుకొని నేయించుకొంటున్నారు. బీద

వాళ్లు చాలమంది ఏకులుతీసికొనివెళ్లి నూలువడికి తెచ్చియిచ్చి కూలి తీసికొనివెళ్లుతున్నారు. స్త్రీల పాఠశాలకూడా బాగా సాగుతున్నది. లోకజ్ఞానానికి సంబంధించిన ఉపన్యాసాలు చిత్రపటాల సహాయంతో వారానికి మూడుసార్లూ, ఆరోగ్యానికి శిశుపోషణకు సంబంధించినవి రెండుసార్లూ, జరుగుతున్నాయి. మొదటిలోఉండే బెదురుపోయి క్రమంగాచిన్నవాళ్లు, పెద్దవాళ్లూ చాలమందివచ్చి శ్రద్ధగా అన్నీ నేర్చుకోటం మొదలుపెట్టారు. నాగయ్య జైలుకాలమంతా సుశీల ఖద్దరువ్యాపకానికి, స్త్రీల అభ్యున్నతికి వినియోగించింది.

---

## ౮ స్వాగతం.

గాంధీ ఇర్విన్ సమాధానం ఫలితంగా మూడునెలలు ముందుగానే నాగయ్యకు ముక్తి లభించింది. నాగయ్యను కలిసికొనుటకు సుశీల, వెంకయ్య పట్నం వెళ్లారు. నాగయ్య ఫలానా రోజు వస్తాడని ముందుగానే చుట్టుప్రక్కల అంతా తెలిసిపోయింది. నాగయ్యకు ఘనమైన స్వాగతం యివ్వాలని బెజవాడలోని యువకులంతా సంకల్పించుకొన్నారు. నాగయ్య గవర్నమెంటుతో సంఘర్షణచేసే కోటికి చెందినవాడు కాకపోయినా, అతని నిరాడంబరసేవ అంతా కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమానికి సంబంధించిందే కావటంచేత, సౌజన్యతచేతను కూడా కాంగ్రెసు నాయకులకు అతనియందు మంచిఅభిమానమే ఉండేది.

బెజవాడ ప్లాటుఫారం జనంతో కిటకిటలాడి పోయింది. కాంగ్రెసునాయకులు వచ్చారు. నాగయ్యదంపతులు, వెంకయ్యా జనసమూహానికి నమస్కారంచేస్తూ మెయిలు దిగారు. దంపతు లిద్దరినీ పుష్పమాలలతో నింపారు. స్టేషన్ జేజేధ్వానములతో ప్రతిధ్వనించింది. అక్కడినుండి ఊరేగింపు టవున్‌లో గుండా గవర్నరుపేట సాగించారు. ఆ రైల్లోనే నాగేశ్వరరావుగారు కూడా దిగారు. నాగయ్యదంపతులు వారికి ఆరోజున అతిథులు.

సాయంత్రం గాంధీపార్కులో నాగేశ్వరరావుగారి అధ్య క్షతక్రింద సభ సమావేశమైంది. పంతులుగారు నాగయ్య నిరాడంబర సేవను ప్రశంసిస్తూ మాట్లాడారు. నాగయ్య మాట్లాడడానికి లేచాడు. చప్పట్లు మోగిపోయినాయి. నాగయ్య మూడేళ్ళపైనుండి సేవచేస్తున్నా బెజవాడ బస్తీలో విద్యార్థి కుల సభలో యెప్పుడూ ఉపన్యాసం చేసిఉండలేదు. ఒకవైపు నుండి లజ్జాభయం, మరొకవైపునుండి దుఃఖం ముప్పిరిగొని పైకి పొంగుతున్నాయి. అల్లాగే గద్గద స్వరంతో తొట్రుపాటుతో మాట్లాడటానికి ప్రారంభించాడు:

“పెద్దల ఆజ్ఞలను ఉల్లంఘింపజాలక మీ సమక్షమున నేను నిలువబడితిని గాని నేను చెప్పతగినది అల్పం. విద్యార్థి కులు, త్యాగధనులు, వితరణశీలురుగల యీ మహాసభయందు నన్ను ప్రశంసించుట నా అల్పత్వము వెయ్యి దివిటీలతో చూప బడినటుల నాకు ద్యోతక మగుచున్నది. ఈ గౌరవమునకు మీ అనురాగముగాని నా అర్హత యెప్పుడును కారణం కాజాలదు. నా స్థితి దలచుకొన్న నాకు మితిమీరిన దుఃఖం కలుగుచున్నది.

దేశస్థితి మిక్కిలి సంతాపకరముగా నున్నది. ఒకవైపున పరాధీనత మరియొకవైపున దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం, మతవైషమ్యములు, మాఢ్యము విజృంభించి తాండవ మాడుచున్నవి. ఈ స్థితి చక్కబడుటయు, మనం ఉద్ధరింపబడుటయు యెట్లు? మహాత్ముడే మనకు ఉద్ధారకుడు. ఆయనకార్యప్రణాళియే లోకకల్యాణప్రదమై దేశస్వాతంత్ర్యసిద్ధి కనుకూలమై యొప్పుచున్నది. ఇట్టి అపూర్వ కార్యక్రమణికను నిర్మించి నడిపించగల సమర్థుడైన సిద్ధపురుషుని మనమధ్య కలిగియు, మనమొక యడుగైన ముందుకు బోజాలనివక్షమున అది మన అనుచరుల లోపమునకు ప్రబల నిదర్శన మని చెప్పక తప్పదు. ప్రజలలో ధైర్యోత్సాహములు వెల్లివిరిసిన వనుటకు సందేహం లేదు. కేవలం ధైర్యోత్సాహములవల్ల కార్యసిద్ధి కానేరదు. ప్రజలయందు కార్యదక్షత, నిర్మాణకౌశలం, త్యాగం, అన్యోన్యత, స్వార్థరాహిత్యం అవసరమై యున్నవి. ఇవి చేకూరక స్వాతంత్ర్యం గగనకుసుమమే. ఈ గుణములు మనలో కంచు కాగడా పెట్టి వెదకిసను కానరాకున్నవి. వీని సాఫల్యసిద్ధికై మహాత్ముడు నిర్ణయించిన విధానమునకు అనుచరుల ఒత్తిడి వలననే తిలోదకము లివ్వబడినవి. ప్రత్యక్షచర్యకు పరుగులెత్తించిరి. మహాత్ముడు మనకు గుణపాఠము నేర్పుటకే శాసనోల్లంఘన కార్యమునకు గడంగినాడు. ప్రజలు ధనాదికమును త్యాగంచేశారుకాని, ఈ మహాత్యాగం పలుతోవల ప్రవహించుటచేత కార్యసిద్ధి కలుగలేదు. ఇప్పుడయినను మనము మహాత్ముని ప్రథమసోపానమైన నిర్మాణ కార్యక్రమమునకు

పూనుకొని పట్టుదలతో నిర్వహిస్తే ప్రజలలో ఐకమత్యం, క్రమశిక్షు, కార్యదక్షత యేర్పడి కార్యసాఫల్యానికి కావలసిన గుణసంపాదన కలుగగలదు. ఈ గుణసంపాదనమే నిజమైన స్వరాజ్యం. పరాధీనత తొలగినను స్వాధీనత సిద్ధింపనిచో మనకు చేకూరు ఫలము శూన్యమే. ప్రత్యక్షచర్యను నేను ఖండించుటకు గాని ప్రశంసించుటకుగాని పూనుకొననుకాని, నిర్మాణ కార్యక్రమముయొక్క ఆవశ్యకతను మీరు గ్రహింపవలెనని పునఃపునః మనవిచేస్తున్నాను." అంతట జేజేధ్వానములతో సభముగిసింది.

మరునా డుదయమున నాగయ్య యేవూరు పయనమై వెళ్లాడు. దారిపొడవున ప్రజలు తమ ప్రేమకానుకల ఊహ కందని రూపాలతో అర్పించడం మొదలుపెట్టారు. ఈ కానుకలను గ్రహించడం అతని హృదయానికి మిక్కిలి భారమైంది. ప్రజలు చూపిన అవ్యాజమైన ప్రేమకు యేరూపంగా సేవచేసి ఋణము తీర్చుకొందునాఅని అతను చింతింపసాగాడు. ప్రజలు విశ్వాసం, గౌరవం చూపినకొద్దీ తమ బాధ్యత యెక్కువైం దనుకొనే కోటిలోవాడు నాగయ్య. సన్మానాలుచూచి సంతోషించి విఱ్ఱవీగే రకం కాడు. సన్మానాల స్వభావం గ్రహించితే మనిషి చాల వినమ్రుడు కావలసిఉంటాడు. సన్మానాల్లో గోరంతలు కొండంతలు చేస్తారు. కొన్ని సందర్భాలలో యిచ్చేవాళ్లు, పుచ్చుకునేవాళ్లుకూడా దొంగలుగానే ఉంటారు. అంతా కపటనాటకమే. ఇవిఆత్మవంచన, లోకవంచన కూడాను. ఒక్కొక్కప్పుడు ప్రజలు తమ అమాయకపు ప్రేమను ప్రకటించడంలో

అత్యుక్తుల్లో పడతారు. అట్టి సందర్భాల్లో యిచ్చేవాళ్ళ మనస్సులు నిర్మలంగాను, సంతోషంగాను ఉంటాయి. కాని పుచ్చుకొనేవాళ్లు తమ అల్పత్వం గ్రహించితే చాల సిగ్గుపడి ఖిన్నులవుతారు.

---

## ౫. గోష్ఠి సమావేశం.

గోష్ఠి సమావేశానికి నాగయ్య ముఖ్యసహచరులు మాత్రమే వస్తారు. దీనిలో నాగయ్య తనకార్యక్రమాన్ని ప్రవేశపెట్టి వాళ్లఅభిప్రాయాలు తెలిసికొంటాడు. ఇష్టాగోష్ఠిగ సాధన విధానాలన్నీ వాళ్లతో చర్చించి, గ్రామంలో స్థితిగతులకు యెంతవరకు అవి ఉపకరిస్తాయో లేకపోతే వానిని యేవిధంగా సంస్కరించవలెనో తెలిసికొంటాడు. సుశీలకూడా గోష్ఠిలో యిప్పుడు సభ్యురాలే. అందరూ తోటలోసమావేశమైనారు. నాగయ్య ముందుగా తన జైలుఅనుభవాలనుగూర్చి చెప్పాడు. దానిమీద జైలుకు పోవడాన్ని గురించి చర్చప్రారంభమైంది.

నాగయ్య—ధర్మపాలనకొరకు జైలుకు పోవలసివస్తే వెళ్లడం విధాయకమే.

వెంకయ్య—ఇప్పుడు వెళ్లేవాళ్లంతా ధర్మంకోసమే వెళ్లుతున్నారా?

నాగయ్య—అందరు అట్టి ధర్మబుద్ధితో వెళ్లకపోయినా దాన్ని ప్రోత్సాహపరిచేవారైనా అట్టిభావంతో చేస్తున్నారనుకోవలె.

సుబ్బయ్య—ఇప్పుడు శాసనోల్లంఘనం చేసే వ్యక్తులకు అట్టి ధర్మబుద్ధి లేదంటూరా?

నరసింహారావు—లేదనే చెప్పవలె.

నాగయ్య—చాలమందికి లేదు. కేవలం ఉద్రేకంచేత, సాహసం చేత వెళ్లుతున్నారు. వాళ్ల నిత్యజీవితంలో ధర్మసంస్కారం యేమీ కనిపించదు. జనబాహుళ్యం మీద జరిగే ఉద్యమాల్లో మనం అటువంటి సంస్కారం ఆశించలేం. కాని నాయకుని ఆజ్ఞాపాలనం, విధేయత ముఖ్యంగా ఉండితీరాలి. అది లేకుండా యేఉద్యమంకూడా జయం పొందదు.

లక్ష్మయ్య—అది మనలో లోపంగా ఉందేమో అనిపిస్తున్నది.

నాగయ్య—లోపం యేమిటి; నిజంగానే లేదు. దాన్ని అంగీకరించడంవల్ల అగౌరవం లేదు. మన జాతీయ జీవనంలో యే లక్షణాలు లోపంగా ఉన్నాయో తెలిసికొంటేగాని వాటిని పొందేందుకు కృషిచేయడానికి వీలుండదు. సాముదాయిక ఉద్యమాలు జయంపొందుటకు అవసరమైన శిక్షాలక్షణాలు మనకు లేవు. దీనికి ముఖ్యంగా కారణం పరాధీనతా, ఐకమత్యశూన్యతా. మనం స్వతంత్రించి యేమి చేసికోలేకుండా ఉన్నాం. ఈలక్షణాలను వృద్ధిపొందించడంగాని అందుకు అవకాశ మివ్వడంగాని విద్యాలయాలు, కళాశాలలు చేయవలసిన పని అయివుంది. మనది యెంతసేపటికి ఒంటికాయ సొంటికొమ్ము లక్షణం, చిన్నినాపొట్టకు శ్రీరామరక్ష. ఇదీ మనతత్వం. లౌకికవిషయాల్లో స్వలాభం ప్రధానం. అదే

విధంగా ఆధ్యాత్మికవిషయాల్లోకూడా వ్యక్తి మోక్షమే ముఖ్యం. ఎవరికి వారు సన్న్యాసం పుచ్చుకొని ముక్కుమూసికొని కూర్చుంటామంటారు. ఇవీ మనజాతీయలక్షణాలు.

నరసింహారావు : మొదటినుండి ఇంతే నంటారా ?

నాగయ్య : ఆవిషయం యిప్పుడు నేను చర్చింపను. అది ఒక గ్రంథం అవుతుంది. ప్రస్తుతం మన అనుభవంలో కనిపించే లక్షణాలు యివి అని గ్రహిస్తే చాలు.

నరసింహారావు : అయితే మన జాతీయజీవనం యేవిధంగా సంస్కారం పొందవలెనని మీ అభిప్రాయం ?

నాగయ్య : ప్రపంచంలో మనం తలయెత్తుకొని తిరగవలెనంటె సమష్టిజీవనం వృద్ధిపొందవలె. అంటీ ముట్టకుండా ఉండే పద్ధతి పనికిరాదు. దానివల్ల జాతి అంతరించవలసి ఉంటుంది. పూర్వంవలె యేజాతికాజాతి, యేదేశానికాదేశం గోడలు కట్టుకొని, గిరులు గీచుకొని కూర్చోటానికి వీల్లేదు. పాశ్చాత్యులు తమ సరకులతో, సైన్యాలతో తలుపులు బద్దలు కొట్టి వచ్చి మీదపడుతున్నారు. ఇప్పుడు మనస్థితి అంతే అయింది. చీనా, జపాను దేశాలు కూడా పాశ్చాత్య దాష్ట్యాన్ని యెదుర్కోవలసి వచ్చింది. జపాను స్వతంత్రం గల చిన్న దేశం కావటంవల్లను, యేకభాష, యేకజాతీయత కలది కాబట్టి వెంటనే జీవనవిధానమంతా మార్చుకొని పాశ్చాత్యులను ఆమడదూరాన నిలవబెట్టింది. జాగుచేసిన చీనా దేశం విశాలమైంది కావటంచేత, స్వతంత్రం కలదైనా

తెప్పరిల్లలేకుండా ఉంది. మనం శతాబ్దాలనుండి పరాధీనతలో ఉండడంచేతను, వేళ్లుబారిన ఆచారాలు, సంప్రదాయాలవల్లను ఛిన్నాభిన్నంగా చెదిరిపోయి ఉండడంచేతను నిర్వీర్యులమై పాశ్చాత్యబాడబాగ్నికి బలియైనాం.

వెంకయ్య: ఇక మనజాతిని పునర్జీవింపచేసే మార్గాలు లేవా?

నాగయ్య: నూతన లక్షణాలు మొలకెత్తాలె.

వెంకయ్య: దానికి మార్గం? మన మేమన్నా స్వతంత్రులమా టర్కీవలె ఒక కలం గీటుతో మార్చివేయటానికీ, రష్యావలె పంచవర్ష దశవర్ష సంస్కారవిధానాలు అమలు జరిపించటానికీ?

నాగయ్య: అవును; అటువంటి అవకాశా లేమిలేవు. కాని భావరూపేణ కొంతప్రచారం కావలె. ఉన్నదాన్నిగూర్చి అసంతృప్తి కావలసినదాన్నిగూర్చి ఆలోచన యేర్పడవలె. ఇప్పుడు జడత్వమేగాని ప్రజల్లో చైతన్యంలేదు; జీవంలేదు. మహాత్ముని ప్రబోధమూలంగా సంచలనం బైలుదేరింది. దీన్ని సరియైన మార్గాల్లో నడిపించడం యిప్పుడు అవసరం. కేవలం ఉద్రేకంవల్ల నూతనలక్షణాలు యేర్పడవు. అవి క్రమంగాసాధనవల్ల ప్రజల్లో నిర్మాణం కావలసిఉంటుది.

వెంకయ్య—మనం నిర్మాణం చేయవలసిన నూతనలక్షణాలు యెట్టివి?

నాగయ్య—జాతీయ ప్రతిష్ఠకొరకు, స్వాతంత్ర్యంకొరకు, క్షేమంకొరకు యూరపుదేశాల్లో ఒక్కొక మనిషి యెంతటి

త్యాగమైనా, సాహసమైనా చేస్తాడు. సంఘసౌభాగ్యానికి ఆత్మలాభం, ఆత్మసౌఖ్యం వదులుకొంటాడు. ఏ ఉద్యమంలోనైనా, కార్యంలోనైనా నలుగురితో కలిసి నడుస్తాడు. నష్టంగాని లాభంగాని నలుగురితో కలిసి అనుభవిస్తాడు. కార్యసాధనకు యెంతటి తెగువయినా చూపిస్తాడు. నూతన విషయాలకోసం, సత్యాలకోసం మనస్సూ బుద్ధీ యెప్పుడూ పరుగెత్తుతుంటుంది. ఇది పాశ్చాత్యసమష్టి జీవనలక్షణం.

సుబ్బయ్య—మనకు లేని లక్షణాలు యిప్పుడు రమ్మంటే యేలా వస్తాయి?

వెంకయ్య—లేవు గనుకనే ప్రయత్నం చేయవలెనని చెప్పడం.

సుబ్బయ్య—ఇవి అబ్బకపోతే మనకు మోక్షం లేదన్నమాటే?

నాగయ్య—నిస్సందేహంగా. కాని ఈ లక్షణాలు మన కబ్బవని నిరుత్సాహపడవద్దు. ఇతరులకు సాధ్యమయినవి ప్రయత్నంమీద మనకూ సాధ్యమవుతాయి. ఒక చిన్నవ్యాపారంలో, ఒక ప్రజాహిత సంస్థలో, స్థానికసంస్థలలో దురాశను, స్వార్థాన్ని చంపుకొని సమష్టిలాభంకొరకు పాటుపడడం చేతకాకపోతే స్వరాజ్యంమాట యేలాఉన్న తిన కూడు కట్ట గుడ్డ లేకుండాపోతాయి. అందువల్లనైనా నూతనలక్షణాలు నేర్చుకోవలసి వస్తుంది.

సుశీల—ఎప్పుడో యెందుకు? ఇప్పుడే వచ్చింది ఆస్థితి.

నాగయ్య—ఇటువంటి మహాకష్టకాలంలోకూడా మనం నలుగురంకలిసి గట్టెక్కేమార్గం చూచుకోలేకపోతే, ధాన్యా

నికి బాగా ధర ఉండి, అడిగినచోట అప్పు పుట్టుతుంటె మనను పట్టపగ్గా లుంటాయా?

వెంకయ్య—ఆ విగ్రహ వీగడం అయిపోయింది. బీదాబిక్కాతో సమానమే అయినారు కొమ్ములు తిరిగిన రైతులుకూడా.

నాగయ్య—ఏమయినా యింకా అభిమానం పట్టుకొని యేడి పిస్తున్నది మనలను. సాహసించి ఒకమార్గం త్రొక్క లేకుండా ఉన్నాం. జైల్లోఉన్న నాకంటే మీకే బాగా తెలిసి ఉండ వలె దేశంలో వ్యాపించిఉన్న దారిద్ర్యం, దైన్యం, అసహా యత.

వెంకయ్య—దీనికి కారణం యేమంటారు?

నాగయ్య—మూడు కారణాలు కనిపిస్తున్నాయి; ప్రపంచిక పరిస్థితులు, ప్రభుత్వ ఆర్థికవిధానం, మన అజ్ఞానం. ఇందులో మొదటిది యుద్ధఋణాలకు సంబంధించినది. ప్రపంచంలో చిన్నమెత్తు బంగారం లేకుండా తుడిచిపెట్టినా యీఋణాలు తీరేవికావు. కాగితాలమీద చేసిన అప్పులు కనకాభిషేకం తో తీరాలని పట్టుపట్టారు. ఫ్రాన్సు అమెరికా ఇంగ్లాండులకు పరపతిపొయ్యే స్థితి వచ్చింది. ఈమూడు దేశాలవారు ఇండి యాలోఉన్న పాదులుకదలించాలని మొత్తువేశారు. దేశంలో చలామణిలోఉన్న కోట్లకొలది ధనమంతా లాగేశారు. బ్యాంకులు సొమ్ము వసూలుచేయడమేగాని, తిరిగి యివ్వ డం మానివేసినాయి. దేశంలో వ్యాపారం చచ్చిపోయింది. ధరలు జర జర క్రిందికి జారిపోయినాయి. చేతిలో డబ్బు

శూన్యమైంది. అప్పు పుట్టదు. ప్రజలా ఆడంబర జీవితాలకి అలవాటు పడ్డారు. చదువులు సంధ్యలు, పెండ్లిళ్లు పేరంటాలు, మేడలు మిద్దెలు, సూట్లు బూట్లు, ఫలహారాలు భోజనాలు, పార్టీ మీటింగులు, మోటారు ప్రయాణాలు, కోర్టు వ్యాజ్యాలు యీ ప్రకారంగా జీవితం రొంపిలో దిగిపోయింది. వీనికిమించి గవర్నమెంటుశిస్తులు, పన్నులు. మనం ఉపయోగించుకొనే పదార్థాల్లో అన్నిటికిపన్నే. ఇవ్విధంగా జీవితందుర్భరంఅయిపోయింది. ఎంత మోయలేకపోయినా తలయినా తాకట్టుపెట్టి శిస్తులు చెల్లిస్తాడుగాని, పరపతీ మర్యాద పోగొట్టుకోడుగదా యేమనిషి. మూలమూలల ఉన్న మూటాముల్లె అంత కడిగిపోశారు రైతులు. బంగారం ప్రవాహమై ప్రవహించింది అమెరికాకు ఇంగ్లాండుకు. బస్తా రెండు రూపాయలైంది ధాన్యం. కూలి డబ్బులు గిట్టటం లేదు. ఇంక కూడుదినే దేమిటి? ఈ స్థితిలోనైనా శిస్తు వసూళ్లు ఆగలేదు. రైతుల ఉదాసీనతకు, బండతనానికి మేర కనిపించలేదు. అడగంది అమ్మైనాపెట్ట దన్నట్టు ప్రభుత్వంకూడా ఉపేక్షగానేఉంది. ఈస్థితిరైతుకూ చెరుపే ప్రభుత్వానికి చెరుపే. ప్రాణంఉండగా పనిచేస్తుంది గాని, అదికాస్తపోయిన తర్వాత యేమందూ యేఇన్‌జెక్షన్ కూడా పనిచేయదు. కాబట్టి సర్వాధికారంగల ప్రభుత్వం యీ స్థితిలో రైతుకు తోడ్పడకపోతే ప్రజలు ప్రభుత్వం కూడా విచారించవలసివస్తుంది. అందుచేత ప్రజలు, ప్రభుత్వంకూడా రైతును నిలవబెట్టాలి.

సుబ్బయ్య—శిస్తు రెమిషన్ యిప్పించమని, వసూలు ఆపుదల చేయమని, ధరలు పెరిగే మార్గాలు చూడమని యెన్ని విధాల మొత్తుకొంటె మాత్రం విన్నారా సర్కారువారు?

నరసింహారావు—మనప్రయత్నం ఆందోళనకూడ తగినంతగా లేదు.

నాగయ్య—మనవద్ద కార్యదీక్షలేదు. తగిన అంగ నిర్మాణం ప్రజాబలం వెనక ఉంటేగాని, మన ఆవేదనయొక్క తీవ్రత సర్కారుమెదడులోనికి యెక్కదు. పాపం! ప్రొఫెసరు రంగాబోటివారు యెన్నోవిధాల ప్రయత్నం చేస్తున్నా రైతులోకం యింకా మేలుకోలేదు.

నరసింహారావు—ప్రజలు యిల్లాగోలపెట్టటం మామూలేఅని గవర్నమెంటు అభిప్రాయం. ఇది మామూలు కాదని వాళ్లకు తెలియచెప్పాలంటె దానికి తగినట్లు పనిచేయాలి.

నాగయ్య—మన పరిస్థితులను గూర్చి కొంతవరకు తెలిసికొన్నాం. ఉపాయాలు ముందు విచారిద్దాం. యోచన చేస్తుండండి.



## ౬. కుటుంబ వ్యవహారం.

ఉద్యోగస్థుల క్రీగంటి చూపులే మహాభాగ్యం గాను, కరస్పర్శలే కనకాభిషేకంగాను అనుకొనే రామయ్యచౌదరి తత్త్వం కూడా, నాగయ్యకు ప్రజలు అయాచితముగ యిచ్చిన

అపూర్వమైన స్వాగతానికి జంకిపోయింది. ఉద్యోగస్థులకు, గవర్నమెంటు మెంబర్లకు తాము యిచ్చే స్వాగతాల్లో, టీపార్టీల్లో యిరువైపుల యెంతటి మోసము, కపటనాటకము, డాబుదర్పము, స్వార్థము ఉందో రామయ్యకు యిప్పుడు వేలుపెట్టి పొడిచి చూపినట్లు కనిపించింది. నిజమైన ప్రేమ, పటాటోపంతో కూడు కొన్న గౌరవాల్లో కాక నిరాడంబరమైన ప్రజల మృదుల హృదాయాల్లో కలదని తెలిసింది. తల్లి తనకు బిడ్డపై గల ప్రేమను ప్రకటించటానికి లేనిపోని వేషాలు వేయదు. అది బిడ్డసేవలోనే వ్యక్తమవుతుంది. సవతితల్లి, పెంపుడుతల్లి తన ప్రేమను ప్రకటంచటానికి యెన్నో వేషాలు వేస్తుంది. ప్రజలు చూపే సహజమైన ప్రేమకు, అధికారుల ఒత్తిడివల్ల జరిపించే గౌరవాలకు, ఎంతో భేదముంది. అధికార్లకు గౌరవం చేసి ఉన్నవి లేనివికలిపి పొగడినకొలది వారికి గర్వం కూడా ఒడాయిస్తుంది. అధికారబలంచేతనే మన కీమర్యాదలు జరుగుతున్నాయి,వ్యక్తిపరంగా కాదని వాళ్ళకు తెలియకపోదు. కాని ఆత్మవంచన చేసికొంటారు. అయితే తాము ప్రజాసేవకుల మనుకొని తమ అధికారాన్ని ప్రజాసౌఖ్యం కొరకు వినియోగించినప్పుడల్ల ప్రజలు దాన్ని గ్రహించకపోవడంలేదు; వాళ్లను హృదయపూర్వకంగా గౌరవించకపోవడంలేదు. నిజానికి ప్రజలహృదయాన్ని ఆకర్షించేది నిష్కపటమైన సేవ అధికార్లయినా సరే, ప్రజానాయకులయినా సరే.

నాగయ్యకు ప్రజలు చూపించిన గౌరవం చూచాడు రామయ్య. ఆరాత్రి రామయ్యకు నిద్ర పట్టనేలేదు. అతని

పూర్వచరిత్ర అంతా జ్ఞాపకం వచ్చింది. తనలో విచారించుకో టం మొదలుపెట్టాడు. నాతోడి రైతులు ఎవరితోను అంటు, సొంటు లేకుండా వాళ్ళమానాన వాళ్లు హాయిగా పనులు చూచుకుంటున్నారు. వాళ్ళను ఎవరూ పలకరించరు. వాళ్లకు యేమి లోపైంది? పోలీసుబంట్రోతు, తాలూకాజవాను మొదలు చిన్న పెద్ద అనే భేదం లేకుండా ప్రతిగవర్నమెంటు నౌకరూ నన్ను పీక్కుతినేవాడే. ప్రొద్దున లేచిందిమొదలు వీళ్లకు ఉమేజువారి చేయటంతోనే సరిపోయె నాకాల మంతాను. పొలం బొట్రా, ఇల్లు వాకిలి చూచుకోటానికి అవకాశమే లేదాయె. ఈ ఉమేజువారి చేయడమే ఒక గొప్ప అనుకొన్నాను. రాను రాను బంట్రోతువాడికికూడా భయపడవలసివచ్చింది. ఆత్మగౌరవం పూర్తిగ శూన్యమైంది. 'ఏమండీ రామయ్యచౌదరిగారూ' అని తహసిలుదారు ఒక కేక వేస్తే ఉబ్బి తబ్బిబ్బుకావడం. ఇంతచేసినా ఇతర్లకంటె నాకు యీఉద్యోగస్థులు వరిగించింది యేమీ లేదు. ఏమైనా పనికావలసివస్తే ప్రతివాడు వాడివాడి అధికారిమెప్పు చూచుకొనేవాడేగాని, మనలాభం చూచేవాడు ఒక్కడూలేడు. ప్రతివాడు రూల్సు ఒప్పవని, పై అధికారి కోప్పడుతా డని తప్పించుకొనేవాడే. కేవలం కార్యవాదులయిన అధికార్ల ముఖ ప్రీతిమాటలకు దాసుణ్ణి అయి సంసారం కూలద్రోసుకొన్నాను. పైపెచ్చు జిల్లాబోర్డు ఎలెక్షను సుడిగుండాల్లో పడి పూర్తిగ మునిగిపోయినాను. ఇప్పుడు అప్పులవాళ్లు చుట్టేశారు. అయ్యో అనేవాడు ఒక్కడులేడు. ఒళ్లెరగకుండా తిరిగానని ప్రతివాడు యెక్కిరించేవాడే యిప్పుడు. ఒక్క అధికారికూడా మాటసహా

య మైనా చేయడు. ఊళ్లోవాళ్లకూ లోకువైనాను, బయటివా ళ్లకూ లోకువైనాను. లొంగినకొద్దీ లొంగదీస్తున్నారు. ఆత్మ గౌరవం కలిగి ధైర్యంగా నిలబడేమనిషిని గౌరవించినట్టు వంగి వంగి సలాంచేసేవాళ్లను ఎవరూ గౌరవించరు. కాంగ్రెసు అంటే ఉండే గౌరవం ఇతరజోహుకుం పార్టీలవారికి ఉందా మరి? లేదు. ప్రజలు తమశక్తి గుర్తెరిగి ఉద్యోగస్థులచేత పని చేయించుకొనే ధైర్యం రావాలి. దీనంగా చేతులు నలుపుకుం టూ నిలబడినంతకాలం నెత్తిమీద మొట్టుతూనే ఉంటారు." అని ఒక కునుకు కునికాడు.

అంతలోనే మరల లేచి కూర్చొని 'నా భాగ్యంతోపాటు నా దాస్యజీవనానికి కూడా నేటితో తిలోదకం యిస్తాను. ఇక నైనా నాతోడి రైతుసోదరులకు తోడ్పడి జీవితం సార్థకం చేసి కొంటాను. ధనధాన్యాలు, బూటకపు పేరుప్రతిష్ఠలు వస్తుం టాయి, పోతుంటాయి. ఈ ధనకాటకంలో యెందరో మోతుబ రులు కూలబడ్డారు. పైపై బడాయిలకోసం ఆత్మనాశనం చేసి కొని శాంతిసౌఖ్యాలు పోగొట్టుకోటమే కాని వచ్చిన లాభం యేమీ లేదు. ఇప్పుడు మావాడిపనే బాగుంది అనిపిస్తున్నది. వాడే ఉద్యోగంలో ప్రవేశించినట్టయితే యిప్పుడుండే గౌరవంలో సహస్రాంశమైనా ఉండేదా? కలెక్టరుకచ్చేరీలో యేమూలనో కునికిపాట్లు పడుతూఉండేవాడు. మనస్సుకు ప్రీతికరంగా ఉండే పనిలోని ఆనందం మరొకదానిలో ఉంటుందా మరి! వాడికి యిప్పుడు యేం లోటైంది! ఎంత ధన మున్నా తినేవి నాలుగు మెతుకులే. మిగతా శాంతిసౌఖ్యాలు మన

స్సుకు సంబంధించినవే. డబ్బున్నవాళ్ళంతా సుఖపడుతు న్నారా? వాళ్ళకుండే భయం, ఆదుర్దా మరొకరికి ఉండదు. నిజా నికి నాలుగు మెతుకులు సంపాదించుకొని పాపభీతి, దైవభ_క్తికలిగి బ్రతికినవాడిదే సౌఖ్యం, ఆనందం." అని యేమేమో తలపోసి కొని దుఃఖించాడు; పరితాపపడ్డాడు. జానకమ్మ అప్పుడే మేల్కొ న్నది. పరిపరివిధాల భ_ర్తను ఓదార్చింది. ధైర్యం చెప్పింది.

జీవితచరిత్రమంతా ఒకసారి తిరగవేసి చూచుకోటంచేత రామయ్యహృదయమంతా దుఃఖభారంచేత కృంగిపోయింది. నరకవేదన అనుభవించాడు. బ్రతుకుమీద రోత పుట్టింది. జీవి తం వ్యర్థమైందని వగచాడు. బ్రతికి పరాభవాగ్నిని భరించడం కష్టమనిపించింది.

ఈ దుఃఖంలో, యీ నిరాశలో నాగయ్యజీవితమే రామయ్యలో ఆశాజ్యోతిని వెలిగించింది. ఆత్మసంయమముతో కూడుకొన్న నిరాడంబరజీవనమే సుఖప్రద మని తోచింది.

---

## ౭. పరివర్తనం.

ఈ పశ్చాత్తాపాగ్నిలోనుండి పునీతుడై వినమ్రుడై బయటపడ్డాడు రామయ్య; నాగయ్యను పిలిచాడు: 'నాయనా, నాజీవితం దుర్భరమై పోయింది. నీ దొంకదారి, నా దొంకదారి అయింది. ఒకనాడయినా నీతో మనసిచ్చి మాటాడలేకపోయి నాను. ఈ మూడునాలుగేండ్లనుండి నీ వెటుల కాలం గడిపావో

విచారించికూడా మెరుగను. నీయెడ నేను మిక్కిలి అన్యాయంగా, కూ్రరంగా, ప్రవర్తించినందుకు నా మనస్సు యిప్పుడు నన్ను పరిపరివిధాల బాధిస్తున్నది. నేను ఏవేవో పిచ్చిపిచ్చి వ్యామోహాల్లో పడిపోయినాను. అవి నానెత్తి అణచేటంతవరకు వానిపిడికిల్లోనుండి తప్పించుకోలేకపోయినాను. నీపై చూపిన నిర్దయే నన్ను యెక్కువగా కలచివేస్తున్నది' అని దుఃఖం పొంగి రాగా నాగయ్యను కౌగిలించుకొని బిగ్గరగా యేడ్వ మొగలుపెట్టాడు. నాగయ్యకుకూడ కళ్లవెంట అశ్రుకణములు జలజల రాలాయి. ఇద్దరికన్నీటిధారలుయేకమైప్రవహించినాయి.

"నాన్నా, నాకొరకు మీ రింతగా విచారించడం యెందుకు? నేనెప్పుడు మీదగ్గరే ఉన్నాను. మీవ్యవహారాల్లో మీరు ఉంటున్నారు. అందుచేత మీకు తీరుబడికాలేదు. అమ్మ యెప్పుడు కనిపెట్టే ఉంటున్నది. నేను పెద్దవాడిని అయినాను. నేనే మీకు సేవచేయవలసిఉంది. మీ యిష్టం నెరవేర్చలేకపోయినానే అని నేను యిప్పటికి విచారిస్తున్నాను. కాని ఈశ్వర పే్రరణకు నేను లొంగక తప్పినది కాదు. ఇప్పుడైనా నన్ను క్షమిస్తే నేను శాంతి పొందుతాను."

'బాబూ, నీమీద నాకు కోపం వచ్చినమాట వాస్తవమే గాని నా తప్పు నేను యిప్పుడు గ్రహించాను. నీవు చేసిందే సరి అని నాకు యిప్పుడు తోస్తున్నది. నాజీవిత మంతా కేవలం కపటనాటకంతో గడిచిపోయింది. అది తలుచుకొంటె నాకు ఘోరమయిన దుఃఖం వస్తున్నది. ఈ నీచపు బ్రతుకు బ్రతికా

లని లేదు. నీమీద మితిమీరిన అప్పులభారం ఉంచి చని పోవడం నాకు మరీ దుఃఖంగా ఉంది."

"నాన్నా, మీమాటలు వినటానికి నాకు కష్టంగా ఉంది. మీజీవితంలో క్రొత్త మార్పు వచ్చింది. మీ పూర్వ చరిత్రను మీరు మరిచిపోండి. గతించినదాన్ని గురించి విచా రించి ప్రయోజనం లేదు. అప్పులను గురించి మీకు భయ మెందుకు? దమ్మిడీలతో తీర్చివేయగలం. ఇంతమాత్రానికి చని పోవడంప్రశంస యెందుకు? భగవంతు డిచ్చిన ఆయుర్దాయం పూర్తిగ జీవించి బ్రతుకు సార్థకం చేసికోవచ్చు. నిరాశకు, నిస్పృహకు కారణం లేదు. ధర్మంయెడ మన కనురాగం కల గడమే భగవంతుని అనుగ్రహానికి నిదర్శనం. నిజమైన జీవితం ముందే ఉంది"

" నాయనా! నేను ఉండీ ఒకటే, లేకా ఒకటే. నాకు యాభై సంవత్సరాలు దాటిపోయినాయి. అన్ని అనుభవాలు అయినాయి. ఇక బ్రతికి నే నేమిచేయాలి? భగవంతుడు నిన్ను తిన్నగా చూస్తే చాలు. అదే నాకోరిక"

"అలా కాదు. మనధర్మం మనం నెరవేర్చినామనే తృప్తి కలిగేంతవరకు, మనం యెన్నికష్టాలు వచ్చినా, ఎన్నిప్రలోభ నాలు అడ్డు తగిలినా వాని నన్నిటిని జయించి, జీవించి జన్మ సార్థకంచేసికోవలె. మీరు యిప్పుడు అన్నిసుడిగుండాలు దాటి బయటపడ్డారు. ఇక ధర్మజీవనానికి, రైతుసేవకు సంకల్పం చేయండి. మీవంటి అనుభవజ్ఞులవల్ల నిజమైన ఉపకారం, సేవ జరుగుతుంది. నాకు యెంతో అండగా ఉంటారు"

"బాబూ! ఇదివరలో ఉద్యోగస్థులచుట్టూ తిరిగి జీవితం వ్యర్థం చేసినదానికి ప్రాయశ్చిత్తంగా ఇకముందు నా జీవిత శేషం రైతుసేవకు వినియోగించడమే నాకుకూడా ధర్మమని తోస్తోంది. ముందు అప్పులవ్యవహారం పరిష్కారం చేదాం. రేపు అందరిని పిలిపిస్తాను"

"నాకు పరమసంతోషం. ధనధాన్యాలు శాశ్వతంకావు. ఈ మూడు నాలుగేండ్లలో యెన్నో కుటుంబాలు తలక్రిందులైనాయి. మనకు ఆస్తి పోయిందనే చింత అవసరంలేదు. అదీగాక బొత్తుగ శూన్యం కాదు. ఏదో కొంత మిగులుతుందిగాని మిగలకపోదు. రేపు ఆపని పరిష్కారంచేదాం"

---

# మూడవ భాగము

## ౧. మన పరిస్థితులు.

నాగయ్యకుటుంబ వ్యవహారాలు పరిష్కారం అయిన తర్వాత ముందు కార్యక్రమం నిర్ణయించుటకు తోటలో గోష్ఠి సమావేశం జరిగింది. గ్రామస్థుల్లో నూతనజీవనం ప్రవేశపెట్టవలె నని నాగయ్యఉద్దేశం. ప్రజలదైన్యం, అసహాయత మిక్కిలి విషాదజనకంగా కనిపిస్తున్నాయి. ఏవైపునుండి చూచినా సహకారం లభించేమార్గం కనబడదు. ప్రజల్లో కలయిక లేదు. ఎవడికి వాడు నలిగిపోతున్నాడు. ఈదుస్థితిలో నుండి గట్టెక్కటానికి, జాతీయసౌష్ఠవానికి తోడ్పడే నూతన లక్షణాలు అలవడుటకు తగిన సాధనగా ఉండే మార్గం సాధించవలె నని నాగయ్యఆశయం. వ్యక్తిగత సంప్రదాయాల్లో పెరిగిన వాళ్లను సమష్టిజీవనానికి తరిఫీతు చేయడం సామాన్యమైన కార్యం కాదు. ప్రాపంచిక పరిస్థితులనుబట్టి చూస్తే యెప్పటికైనా తోడిదేశాల్లో తలయెత్తవలెనంటే, ఆఖరుకు ప్రాణంతో నిలబడుటకైనా సాముదాయిక జీవనం ఈ రోజుల్లో తప్పనిసరి అయింది. ఎవరికి వారే అన్నామా జాతి అస్తమించక తప్పదు. సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, చివరకు ఆధ్యాత్మికంగా కూడా సమష్టియత్నాలకే జయం. ఇదే ప్రజలకు బోధపరచాలి. అందుచేత ఈ సమావేశానికి ఊళ్లో రైతులను కూడా కొంతమందిని పిలిచాడు. నాగయ్య ప్రసంగం ప్రారంభించాడు:

"దేశంలో స్థితిగతులు మీరు చాలవరకు తెలిసికొని ఉన్నారు. ముఖ్యంగా రైతులకష్టాలు మన కందరికి అనుభవమే. పూసా పుడకల్లోసహా దూసిపుచ్చాం. వెనుక అండ మన కేమి కనిపించడం లేదు. ధాన్యంధర పూర్తిగ అడుగంటింది. శిస్తులు పెరుగుతున్నాయి. డబ్బులేకుండా ప్రభుత్వం యెట్లా నడుస్తుంది నిజానికి? పాపం! మన శాసనసభ్యులు గవర్నమెంటుకు యేమో తెలియనట్టుగా సలహాలు యివ్వబోతారు; సిబ్బంది తగ్గించమని, సైన్యం తగ్గించమని, పోలీసుతగ్గించమని, జీతాలు అలవెన్సులు తగ్గించమని, తెల్లవాళ్ళకు బదులు నల్లవాళ్ళను ఉద్యోగాలకు తీసుకోమని యేవేవో చెప్పుతారు. స్వతంత్ర దేశాల్లో యీరీతిగా ఖర్చులు తగ్గించుకొని రైతులకు, పరిశ్రమలకు సహాయం చేస్తున్నమాట వాస్తవమే. ఈసలహాలు చేసేటప్పుడు మనవాళ్లు, మనం పరప్రభుత్వంక్రింద ఉన్నామన్నమాట మరిచిపోతుంటారు. స్వదేశాల్లో ప్రభుత్వానికి ప్రజలేమంచికి చెడ్డకు అండ. పరప్రభుత్వానికి సైన్యం పోలీసు, ఉద్యోగస్థులు, స్వజాతీయులు అండ. కావలెనంటె విద్యాశాఖలోను, డి. పి. డబ్ల్యులోను, వ్యవసాయ శాఖలోను ఖర్చు తగ్గిస్తామంటారు. ప్రస్తుతస్థితిలో మనకు ప్రభుత్వంనుండి కోరినంత సహాయం దొరకజాలదు. మనకు వాళ్లకు సామరస్యం కుదిరి విశ్వాసం యేర్పడితే, అప్పు డేమయినా పరస్పరం దేశక్షేమానికి పాటుపడుటకు అవకాశ ముంటుంది. అంతవరకూ వాళ్లు యిచ్చిన అవకా

శాలు ఉపయోగించుకుంటూ స్వశక్తిచేత బాగుపడేందుకు ప్రయత్నంచేయవలసిఉంటుంది.

రామయ్య—ప్రభుత్వసహాయం లేక స్వశక్తిచేత మన మేమయినా చేయగలది ఉందా?

నాగయ్య—ప్రభుత్వశాసనాలు మనను అన్ని వైపుల బంధించి ఉంచాయి. ఈ బంధాలతోనే కొంచెం కాళ్లు మెదల్పడానికి అవకాశం యిచ్చారు. దాన్ని ఆధారం చేసికొని వీలయినంత పైకి ప్రాకుదాం. కాని మనలో పట్టుదల, ఉత్సాహం కనిపించవు. ముద్ద కలిపి నోట్లో పెట్టితే మ్రింగుదా మని కోరిక. అంతేగాని ఉన్నవాటిలో మన కిష్టమైనవి కలుపుకొని తిందా మని ప్రయత్నం లేదు. చంటిపిల్లవాడు వేలు అందిస్తే నడుద్దామని ఉత్సాహపడుతాడు. అటువంటిఉత్సాహంతో మనం పనిచేయవలసిఉంటుంది.

సుబ్బయ్య—చస్తుంటేకూడూ గుడ్డాలేక, ఉత్సాహం యెక్కడ వస్తుంది చెప్పండి?

నాగయ్య—ఉత్సాహం, పట్టుదల మానసిక సంబంధమైన శక్తులు. అవి కేవలం కూడూ గుడ్డామీద ఆధారపడి లేవు. యుద్ధంలో సర్వనాశనమైన జర్మనీఉత్సాహం, పట్టుదల, జాతీయాభిమానం ఉండబట్టి యితర దేశాలు అణచిపెట్టాలని యెంత ప్రయత్నం చేసినా యెురాయించి యెదురు నిలుస్తున్నది. కనుక నా ఉద్దేశంలో ప్రభుత్వంతో వైరం లేకుండా సమష్టిప్రయత్నాలవల్ల వృద్ధిలోకి రాగలమని

తోస్తుంది. ఇతరదేశాల్లో కూడా ప్రజలు ముఖ్యంగా స్వప్రయత్నంచేతనే పైకి వస్తున్నారు. ప్రభుత్వం సహాయం చేస్తున్నది. పరస్పరసహకారం కావలె. విదేశాల్లో ఈ గుణం పిల్లలకి ఉగ్గుపాలతోనే నేర్పబడుతున్నది. వాళ్ల ఆట పాటలన్నీ యిట్టిగుణాలనే పెంపొందిస్తాయి. ఇప్పుడయినా మనం ప్రయత్నం చేయడం ఆలస్యంకాజాలదు. మన అవకాశా లేమిటో ముందు విచారించుకోవలె.

---

## ౨. మన అవకాశాలు.

రైతుజీవితం ఋణాలవల్లనలిగిపోతున్నది. దాన్నిఉద్ధరించేందుకు అవకాశాలు యిదివరకేం ఉన్నాయో, అవి యెంతవరకు ఉపయోగపడతాయో అని విచారించడానికి పూనుకొన్నారు గోష్ఠిసభ్యులు.

వెంకయ్య—ఇప్పుడు మనకు అనుష్ఠానమార్గ మేమయినా ఉందా?

నాగయ్య—ఇదే మార్గమని అచ్చుగుద్దింది యేమీలేదు. మన స్థిరసంకల్ప బలంవల్ల, త్యాగంవల్ల, సాహసంవల్ల ఒక విధానం రూపం చెందవలసి ఉంటుంది. మన పరిస్థితులకు, అవసరాలకు అనుకూలమైంది మనం నిర్మాణం చేసికొందాం. అంతేగాని సులుసూత్రమైన మార్గం ఉందని మీరు భ్రమపడవద్దు.

రామయ్య—ఇదివరలో మన దేశంలోగాని, ఇతర దేశాల్లోగాని ఆచరణలో ఉన్న పద్ధతులు యేమీ లేవా?

నాగయ్య—మన దేశంలో ఉన్నవి మీకు తెలిసే ఉంటాయి.

వెంకట్రామయ్య—అవును. రైతులకు సహాయంగా ఉంటాయి అనే కో-ఆపరేటివు సొసైటీలు, మార్టిగేజిబ్యాంకులు యేర్పాటుచేసి గవర్నమెంటువారు ప్రోత్సాహంచేసి, సహాయం చేస్తున్నారు.

నాగయ్య— గవర్నమెంటువారు నిజంగా మన సహాయం నిమిత్తమే సహకారోద్యమాన్ని ప్రోత్సాహపరుస్తున్నారు. కాని దాన్ని మనవాళ్లు సరిగా ఉపయోగించుకోనడంలేదు.

వెంకట్రామయ్య—అదిబక్కవాళ్లకేమీ యెక్కువగాఉపయోగపడడంలేదు. దానిలోనూ మోతుబరులు అప్పుపుచ్చుకొని యెక్కువవడ్డీలకు బీదవాళ్లకు యిస్తున్నారు. బీదవాళ్లు వాయిదాలప్రకారం సొమ్ముకట్టడం తెలియక, కట్టజాలక, గుజస్తుపెట్టుతున్నారు. ఉద్దులకు, నూర్పిళ్లకు, అక్కరలకు అనుములకు సొమ్ముపుట్టటమే లేదు. వీటికి మామూలుగ సాహుకార్లవద్దకే వెళ్లవలసివస్తున్నది. దీనివల్ల మాకు యెక్కువలాభం కలగడంలేదు.

నాగయ్య— ఇది మనజాతీయజీవనంలో ఉండేలోపానికి గొప్ప నిదర్శనం. సమష్టిజీవనానికి, సౌభాగ్యానికి పాటుపడడం యెరగం. స్వలాభమే ప్రధానంగా చూచుకొంటాం. అందుచేత సంఘంయొక్క సమష్టిలాభానికి యేర్పడ్డసంస్థలుకూడా

వృద్ధికిరావడంలేదు. రైతుఋణాలు పరిష్కారంకావడానికి కూడా యీస్థితిలో అవకాశాలు కనిపించడం కష్టమే.

రామయ్య—ల్యాండు మార్టిగేజి బ్యాంకులు కూడా మొదటిలో అనుకొన్నంత ఉపయోగకారిగా ఉండడంలేదు.

నాగయ్య—ఎందువల్ల ?

వెంకట్రామయ్య—పొలాలు యెక్కువధర పలుకుతున్నప్పుడు, ఆ ప్రాప్తిని ధరలు కట్టడంచేత ఋణాలు యిచ్చినవాళ్లు, పుచ్చుకొన్నవాళ్లు కూడా చాలా భంగపడ్డారు. అలాగే బ్యాంకులు కూడా మోసపోయినాయి. ప్రజలు జాగ్రతగా జీవించడం నేర్చుకొనకపోవడంవల్ల ఖర్చులు మామూలుగానే ఉన్నాయి. అవసరానికి యితరచోట్ల యెక్కువ వడ్డీకి అప్పులు తెచ్చి బ్యాంకిఅప్పు తీర్చి పొలాలు విడిపించుకొని మరల మామూలుగ అప్పుల్లో పడుతున్నారు.

నాగయ్య—దీన్నిబట్టి మనకేమి బోధపడుతున్నది? ప్రజలలో తగిన ప్రబోధం, జ్ఞానవికాసం లేకుండా మన ప్రయత్నాలు ఫలించవు. మనకు ఉన్న సహాయాన్ని, అవకాశాలను ఉచితమైన రీతిని ఉపయోగించుకొనే స్థితిలో రైతు ఉండాలి. ఇదివరలో ఎందుకు అప్పులపాలు కావలసివచ్చిందో ఆకారణాలు యిప్పుడు సంస్కరించుకొనకపోతే బాగుపడే మార్గం లేదు. పొదుపుగా జీవించడం, అనవసరపు ఖర్చులు మానివేయడం, ఆదా వృద్ధిచేసికోడం ఈమూడు మార్గాల్లో మనం యెక్కువగా కృషిచేస్తేగాని తగిన ప్రతిఫలం కనిపిం

చదు. ప్రైవేటు బ్యాంకులు: అంటే మార్వాడీలు, సాహుకారులు ఒకవిధంగా రైతుల దురభ్యాసాలకి కారకు లని చెప్పవచ్చు. కొంతమంది బీదరైతులకు వాళ్లే అండ అంటారు. కాని అప్పుచెయ్యడ ముందే అది తాగుడు వంటి ఒక దురభ్యాసం. అప్పు పుట్టినకొద్దీ చేయవలెనని బుద్ధి పుట్టుతుంటుంది. తాగినకొద్దీ తాగవలెనని కోరిక కలుగుతున్నట్టుగానే. అవసరం బేఅవసరం అనే విచారణ లేకుండా అప్పులు తేవడం, మేడలకు మిద్దెలకు, పెళ్లిళ్లకు పేరంటాలకు ఖర్చుచేయడం బాగా అలవాటైంది. పోటీలు పడి పొలాలు కొనడం, బస్తీషోకులు, యింకా యిటువంటివి ఎన్నో రైతులు నేర్చుకొన్నారు. ఇవన్నీ తిరిగి వదులుకోవలె.

వెంకట్రామయ్య—మీరు చెప్పిన సంగతులు మా కందరికీ ఒప్పుదలేకాని, మేము చెప్పేదేమిటంటే, రైతుకు అప్పులేకుండా జరుగదు. కనక సాహుకారుదగ్గరకు పోకుండా అప్పు పుట్టేమార్గం యేదైనా ఉందా? ఇది వ్యవసాయానికి సంబంధించిన ఋణములవిషయం. ఇదివరలో చేసిన పెద్ద అప్పులుసంగతికూడ విచారించుకోవాలి. మరొకటి మీరు చెప్పేది ఆదాయం వృద్ధిచేసికోవలెనంటారు. అది ఎట్లా జరుగుతుందో చెప్పండీ!

రామయ్య—ఋణాలవిషయమే ముందు ఎత్తుకోండి.

నాగయ్య—రేపు మాట్లాడుకుందాం.

## 3. ఋణాలు.

నాగయ్య—ముందు అప్పుల విషయం ఆలోచిద్దాం. ఎక్కువ ఖరీదు ప్రాప్తికాడికి అంచనా వేసికొని, సాహుకార్లు పొలాల మీంద అప్పు లిచ్చారు. ఇప్పుడు ధరలు పడిపోవడంచేత అసలుకే మోసంవచ్చింది వడ్డీ వదులుకొన్నా. ఇవ్విధంగా చాలమంది నష్టపడ్డారు. రైతులేమో పొలాలు కట్టుకోమంటారు. సాహుకారు పొలా లేమి చేసికొంటాడు? పాపం! దీనివల్ల మన మొకపాఠం నేర్చుకోవచ్చు. ఈవడ్డీవ్యాపారం యెవరికివాళ్లు విడివిడిగా చేయడంవల్ల యేరైతుకు యెంత అప్పు ఉందో సాహుకారుకు తెలియదు. రైతుకూడా దొరికినచోటెల్ల అప్పు తెస్తున్నాడు. వడ్డీవ్యాపారంకూడా సమష్టిగా జరిగితే రైతుకీ సాహుకారుకూ కూడ లాభమే. ఇప్పటి మోస్తరుగా సంసారి దివాలాయెత్తడంసాహుకారు నష్టపడడం ఉండదు. వ్యాపారం ఒకటే మోస్తరుగా కట్టుదిట్టంగా నడుస్తుంది. నిలవసొమ్ము ఉన్నవాళ్లు యెక్కువ వడ్డీకి ఆశపడి మోసపోవడంకంటె సహకారపరపతిసంఘాల్లో నిలవచేసికొంటే ఒడిదుడుకులులేకుండా వడ్డీ వస్తుంది. అసలుకు నష్టముండదు. సహకారసంఘాలు తగిన ఆధారంలేకుండాను, ఆస్తినిగూర్చి సంజాయిషీ పుచ్చుకోకుండాను అప్పులు యెప్పుడూ యివ్వవు. సాలియానా ఖర్చులకు యిటువంటి సహకార సంఘములద్వారా అప్పులు తెచ్చుకొనుట, తిరిగి ఇచ్చుట అలవాటు చేసికొంటే

దుబారాఖర్చులకు యెక్కువ అవకాశ ముండదు. పొదుపుగా జీవించడం నేర్చుకొంటాం.

రామయ్య—ఇదివరలో చిన్న రైతులకు సహకార సంఘాల్లో సరిగా అప్పులు పుట్టటం లేదని ఆక్షేపణ వచ్చిందిగా?

నాగయ్య—అవును. సహకారం అనే శబ్దంయొక్క భావాన్ని మనం అర్థం చేసికోలేదు. ఈ ఉద్యమం ఉద్దేశం ఒకరి కొకరు సహాయం చేసికోటమే. పలుకుబడిగల యే ఒకరిద్దరో ఉన్న సొమ్ము యావత్తు స్వలాభానికి ఉపయోగించుకోటం మాత్రం కాదు. కనుక మనలో జ్ఞానవికాసం, ఆత్మవిశ్వాసం, సహకారం, సమష్టిభావం కలగవలె. ఈ ప్రబోధం లేనంతకాలం, ఉత్తమ లక్షణాలు యేర్పడనంత కాలం మనను ఉద్ధరింపగల శక్తి ప్రపంచంలో లేదంటె నమ్మండి.

వెంకటామయ్య—చిన్నప్పుల విషయంలో మీరు చెప్పింది నిజమే కావచ్చును. పెద్దప్పుల విషయంలో భూమి తనఖా బ్యాంకులు కూడా ఉపయోగంగా ఉండడం లేదే.

నాగయ్య—ఏదైనా ఒక విధానం ఉపయోగంగా ఉండడం, ఉండక పోవడం దానిని ఉపయోగించుకొనే వాళ్లలో ఉంది గాని కేవలం దానిలోనే లేదు. ఆవిధానంలో అవసరం కలిగితే అనుభవంమీద మార్పులు చేసికోవచ్చు. ఋణ విముక్తి చేసికోవలెనని గాఢమైన పరితాపం, కోరిక మీకు లేనప్పుడు బ్యాంకిలోని సొమ్మంతా కుమ్మరించినా యీ ఋణాలు తీరుమానం కావు. పొలాలు ఒకటికి రెండు

మూడు తాకట్టులు పెట్టి, ఒకచేతిలోనుండి మరొకచేతి లోకి త్రిప్పుతుంటె రైతు బాగు పడడానికి యేమైన అవకాశముందా? రైతుల్లో వ్యాపించిన అజ్ఞాన వ్యామోహం తొలగటానికి మున్ముందు ప్రయత్నం చేయవలె.

రామయ్య—రైతు ఈ ప్రకారంగా చేయకుండా శాసనం చేయ కూడదూ.

నాగయ్య—చేయవచ్చు. మనుష్యులలో వికాసం కలగంది శాసనాలు నిరుపయోగంగా పుస్తకాల్లో ఉంటాయి. ఉపయోగించు కొనుట చేత కాక పోతే యేవస్తువయిన వ్యర్థమవుతుంది. అట్లని శాసనం నిరుపయోగమని నేను చెప్పడం లేదు. శాసనం మనకు అధికారం కలుగ జేస్తుంది. సాహుకారు వడ్డీ వ్యాపారం నిరుత్సాహ పరిచే యుజరీచట్టం మోస్తరువి చేయవచ్చు. దాన్ని పూర్తిగ లేకుండా చేస్తేనే అప్పుల సమస్య త్వరగా పరిష్కారమై సమష్టి ప్రయత్నాలకు ప్రోత్సాహం కలుగుతుంది.

వెంకట్రామయ్య—మీరు చెప్పేది చాల విపరీతమైన మార్పు. దానివల్ల బీదజనులు చాల కటకటపడిపోతారు.

నాగయ్య—మనకు మొదట్లో ఆలాకనిపిస్తుంది గాని, నిజానికి పర్యవసానంలో వాళ్లే లాభంపొందుతారు. సమష్టిజీవనం యొక్క ఉద్దేశం బీదవాళ్లను రక్షించటమే. వాళ్ల అవసరాలకు మనం ఆదుకొని వాళ్లను దురభ్యాసాలనుండి, దుబారా ఖర్చులనుండి కాపాడవలె. వాళ్లకర్మానికి వాళ్లను

వదలివేసినట్టయితే వాళ్లు యెప్పటికీ తెప్పరిల్లరు. వడ్డీలతో యెప్పుడూ మునిగిపోతూనే ఉంటారు. సంఘంలో అందరుబాగుంటేనే సంఘంబాగుండేది, గ్రామంబాగుండేది.

వెంకట్రామయ్య—ఆదా లేనివాడికి, ఆస్తిలేనివాడికి అప్పుయేలా యిస్తాం? యేలా ఆదుకొంటాం?

నాగయ్య—సాహుకారుమాత్రం యేలా యిస్తాడు?

వెంకట్రామయ్య—వాడిచేత కూలి నాలి చేయించుకొంటాడు; లేకపోతే, వాడు పండించేవి యేమైనా ఉంటె అవి తీసికొని జమకట్టుకొంటాడు.

నాగయ్య—మనం కూడా ఆలాగే చేస్తాం. గ్రామంలో ఉన్న అందరిని కూడకట్టుకరావడమే మనఉద్దేశం.

వీరాస్వామి—ఈ సందర్భంలోనే పంచముల స్థితిని కూడా విచారించడం అవసరమని తోస్తోంది.

నాగయ్య—వాళ్ళూ ఆర్థికంగా వృద్ధిలోకి వస్తేనే బాగుపడటానికి అవకాశం కలుగుతుంది.

వీరా—ఆవిషయమే నేను మనవిచేయవలెనని వేచిఉన్నాను. ఈ సమావేశానికి గ్రామంలోని పెద్దలు, మోతుబరి రైతులు చాలమంది దయచేశారు. గ్రామంలోని నిజపరిస్థితులు తెలిసికొనేందుకు ప్రయత్నం చేస్తున్నాం. నేను దాపరికం లేకుండా ఉన్నది ఉన్నట్లు మాట్లాడితే కొంతమందికి అయిష్టంగా ఉంటుందేమో అని సందేహిస్తున్నాను. మీ సెలవైతే మాకష్టాలు కూడా మనవిచేసికొంటాను.

నాగయ్య—నీకేవిధమైన సందేహం ఉండ నక్కరలేదు. మీ కష్టాలు మీకు తెలిసినట్లు మాకు తెలియవు. గాడిదకష్టం చాకలి కేం తెలుస్తుంది? కాని యిప్పుడు మన మందరం సమష్టిగా వృద్ధిపొందటానికి ప్రయత్నం చేస్తున్నాం. గ్రామంలో యేసంఘం అసంతృప్తిగా ఉన్నా గ్రామంలో శాంతి, సౌఖ్యం, ఆనందం ఉండజాలవు. మీ యెడల మాకు యేవిధమైన ఉదాసీనత లేదు. కనుక అరమరిక లేకుండా నీకు న్యాయం అని తోచిందేమో చెప్పు.

వీరా— చిత్తం. దక్షిణాఫ్రికాలో కూలీలనిర్బంధదాస్యాన్ని గురించి మన మెంతో కటకట పడుతున్నాం. మన దేశంలో మన గ్రామాల్లో ఉండే బానిస జీవితాన్ని మనం గమనించడం లేదు. అలవాటై పోయినతర్వాత యెంత నికృష్ట పుబ్రతుకైనా పరిపాటైపోతుంది. అంతమాత్రంచేత దాన్ని సంస్కరించవలసిన బాధ్యత మనకు తోలగదు. మాలో స్వంతభూము లున్నవాళ్లు అరుదు. అందరు కూలిచేసికోనో పాలేళ్ళుగానో కాలం గడుపుతున్నాం. మొగుడు, పెళ్లాం కష్టపడ్డా సరిగా పొట్టగడవదు. దానిలో సగం తాగ్రుడికి చుట్టలకే సరిపోతుంది. మిగిలింది ఒకపూటకు కూడా సరి పోదంటె నమ్మండి. పాలేళ్ళుగా ఉన్నా మాగతి అంత గానే ఉంది. ఏదొరదగ్గరో పాలేరుగా ఉంటే సాలుమొత్తం మీద ఖప్పందుమో, రెండుపుట్లో యిస్తారు. దీనితో సంసారం యేం గడుస్తుందీ. మంచీ చెడ్డకూ దొరలదగ్గర అప్పులు తీయకతప్పదు. ఈ అప్పులు తీరేగతి లేదు. ఈ

స్థితిలో పాలేర్ను భూస్వామికి శాశ్వతంగా బానిసలుగా ఉండవలసిందేనా మరి? ఆదొర మంచివాడై దయాదాక్షిణ్యంగా చూస్తేతప్ప, లేకపోతే, ఆయన తిట్టినా కొట్టినా, భత్యం సరీగా యిచ్చినా యివ్వకపోయినా ఆయనవద్దనే నౌకరీ చేయవలసిందేగా. ఇంకొకరు యెక్కువ యిస్తానన్నా మానుకపోవటానికి వీల్లేదు గదా! ఈసామ్మ్కు, పైగా భార్యాబిడ్డలుకూడా ఊడిగం చేయవలసి వస్తున్నది గదా! తరతరాలకు యీ ఋణాలు తీరవుగదా! కొంచెం కోపం వస్తే బండబూతులు. మారుమాటాడితే చెప్పుదెబ్బలు, కఱ్ఱ దెబ్బలు - తమకు తెలియందేమున్నది. ఈ నీచస్థితిలోనుంచి మాకేమైన ముక్తిమార్గం మీరే చూపించవలె. మేము అశక్తులం.

నాగయ్య—నీవు చెప్పింది చాలవరకు నిజమే. నాకు తెలియకపోలేదు. ప్రజలలో పరివర్తనం యెప్పుడు వస్తుందా అని కాచుకొనిఉన్నాను. తలనొప్పి, జ్వరం తనదాక వస్తేగాని దానిబాధ తెలియదని ఒకసామెత ఉంది. ఇప్పుడు అందరు కష్టాల్లో మునిగిఉన్నారు. తిండిలేకపోవడం అంటె యేమిటో, అవమానమంటె యెట్టిదో యిప్పుడు అందరికి అనుభవంలోకి వచ్చింది. ఈ మూలకంగా భగవంతుడు మన నందరిని ఒక్కటిగా చేర్చినాడు. అందుచేతనే భక్తులు దారిద్ర్యంలో భగవంతుని దర్శింపగలుగుతున్నారు. ఆకారణం చేతనే దరిద్రనారాయణునిసేవ ఉత్తమ మైందని చెప్పడం. మాకందరికి కూడా మీతో పూర్ణమైన సానుభూతి ఉంది.

ఇప్పుడు మనం సంకల్పించిన పునర్నిర్మాణంలో అన్ని సంఘాలు సమాన ప్రతిపత్తి పొందుతాయి. ఈ లోపుగ మీరు మీ దురభ్యాసాలను పూర్తిగ నిర్మూలించటానికి పూనుకోండి. అప్పుడు గాని మీ అప్పులను తీర్చటానికి సంఘం పూనుకోదు. మీ రందరు సంఘుంతరఫునే నౌకరీచేసి మీ అప్పులను తీర్చుకోవచ్చు. పొదుపుగా జీవించటానికి అనేక యేర్పాట్లు జరుగుతాయి. వాటినన్నిటిని ఉపయోగించుకొని సొమ్ము కూడబెట్టుకోవచ్చు. మా ప్రయత్నాలకు మీరు కూడా సహాయపడితే అంటుదోషం, ఆర్థికదోషం కూడా పోతుంది.

రామయ్య—ఇది మధ్యవచ్చిన పిల్లసమ్మెరీ. అసలువిషయానికి వద్దాం.

నాగయ్య—అది స్వల్పవిషయంగా కనిపిస్తుందికాని మననూతన విధానంలో బీదవాళ్ల సమస్య—అందులో పంచములది—చాల ముఖ్యస్థానం ఆక్రమిస్తుంది.

రామయ్య—అలాగే కావచ్చు. మన ప్రస్తుత విషయం, భూమి తనఖా బ్యాంకులలో భూముల మీద యిచ్చిన అప్పులను తీర్చుకొనుటకు వాయిదాలు, 20 నుండి 30,40 సంవత్సరాలవరకు హెచ్చించవలెనని అంటున్నారు.

వెంకటామయ్య—వాయిదాలు యెక్కువయితే సాలియానా చెల్లించవలసిన మొత్తం తగ్గుతుంది. అందువల్ల రైతుకు ఋణతీర్మానం కష్టమనిపించదు.

నాగయ్య—కాని, వడ్డీ యెక్కువైనప్పటికి, యెక్కువ సొమ్ము అప్పు యిచ్చేవాడి వద్దకే రైతు యెప్పుడు వెళ్లుతుంటాడు.

అవసరమైనప్పుడు నోటుతిరుగ వ్రాసి మళ్లీ కొద్దో గొప్పో అప్పు తెచ్చు కొంటుంటాడు. ఇటువంటి అవకాశాలు బ్యాంకు యివ్వదు. అందువల్ల అప్పులు యిచ్చే సాహు కారు దొరికితే బ్యాంకి అప్పు చెల్లించి, భూమి వదిలించు కొని వాడికే తాకట్టు వ్రాస్తాడు.

రామయ్య—ఈ ప్రకారంగా భూమిని వదిలించుకొనుటకు వీలు లేకుండా చేయకూడదూ!

నాగయ్య—చేయవచ్చు. కాని దానికి చాల ఆక్షేపణలు వస్తాయి. రైతులు తమక్షేమాన్ని బాగా గమనిస్తే ఆక్షే పించరు. ఈ విషయం బోధపడుటకు పూర్వం గ్రామస్థు లలో చాల భావపరివర్తన కలుగవలసి ఉంటుంది.

వెం. రామయ్య—అప్పుడు భూమి యావత్తు సొసైటీది అవు తుంది. భూమి ఖామందు అంటూ ఉండనే ఉండడు.

వెంకయ్య—సొసైటీ యెవరిది?

సుబ్బయ్య—సంఘం మనదే అనుకో. అయితే మాత్రం భూమి బాధ్యత ఎవరికి ఉంటుంది?

రామయ్య—ఎవడు సాగుచేస్తాడు? ఎవడు మరమ్మతులు చేస్తాడు.

వెంకయ్య—ఇప్పుడు రష్యాలో భూమి అంతా గవర్నమెంటుదే కదా. రైతుకు భూమిహక్కు, ఫలసాయం హక్కు-కూడా లేదంటారే. అచట మాత్రం వ్యవసాయం జరగడం లేదూ? పంటలు పండడంలా?

సుశీల—ప్రపంచానికి కావలసిన పంటంతా వాళ్లే పండించి ముంచెత్తుతా మంటున్నారు.

---

## ౮. సామ్యవాదం.

కృష్ణయ్య—మీరు నిన్న చెప్పిన సిద్ధాంతం కమ్యూనిజం, బాల్షివిజంలోకి దిగుతున్నది. ఇది మనదేశంలో ఒక నిమిషం సాగదు. ఇచట జమీందార్లు, ప్రొప్రయిటర్లు పెద్ద పెద్ద భూస్వాములు ఉన్నారు. భూమిని ప్రాణంతో సమానంగా చూచుకొనే రైతు భూమిహక్కు యెప్పుడూ వదులుకోడు. పైగా ప్రభుత్వం పూర్తిగ ధనికులది. వాళ్ళు విదేశీయులు. వాళ్ళ దేశంలోనే కమ్యూనిజం తలయెత్తకుండా అణగద్రొక్కేస్తున్నారు. మనదేశంలో మొన్న మొన్ననే సంవత్సరాలకొలది శిక్షలు వేశారు కమ్యూనిస్టులని అనుమానపడ్డ వాళ్ళందరికీ.

నాగయ్య—రైతుకు భూమిహక్కు లేకుండా చేయడం కమ్యూనిజమని, దాన్ని గవర్నమెంటు అణగద్రొక్కుతారని ఏవేవో చెప్తున్నారు. ఎఱ్ఱగుడ్డను చూచి ఎద్దు బెదరినట్టుగా మనం పేర్లను చూచి భయపడడం మన అవివేకానికి, చేతగానితనానికినిదర్శనం. మన మనస్సుకు తోచినట్లల్లా నామకరణంచేయడం ఉద్యమానికిహానికరం. మనకు పేర్లతో నిమిత్తంలేదు. మన పరిస్థితుల కనుకూలమైంది, మన కష్టాలనుండి మనను గట్టెక్కించేది ఏదో ఆమార్గం మనం యేర్పాటు చేసికొందాం. ఒకదేశాంది మరొకదేశానికి పూర్తిగ అనుకూలిస్తుందని యెప్పుడు చెప్పలేం. కమ్యూనిజం సమత్వం ప్రతిష్ఠించాలనే ఉద్దేశంతో ధనికులను పలుకుబడిగల ప్రభుత్వాలను పడగొట్టాలని ప్రయత్నం చేస్తు

న్నది. ధనికుల ప్రభుత్వం సహజంగా దాన్ని నిర్మూలం చేయటానికి పూనుకొన్నది. మన ఉద్దేశం అసలు ప్రజలను దారిద్ర్యంనుండి అజ్ఞానంనుండి ఉద్ధరించడం. ప్రభుత్వంతో వైరం పెట్టుకోటం కుతంత్రాలు పన్నడం మన విధానంకాదు. మన ఉద్యమం ఫలించడానికి ధనికుల సహాయం ప్రభుత్వ సహాయంకూడా తీసికొంటాం. ఒకప్పుడు భేదభావం కలగవచ్చు. అంతమాత్రంచేత అది వైరంఅవుతుందనుకోవద్దు.

కృష్ణయ్య—అయితే మీరు కమ్యూనిజం నిరసిస్తున్నారా?

నాగయ్య—కమ్యూనిస్టుల క్రూరపద్ధతులు, దౌర్జన్యం, పోరాటములు కల్పించటం మనం నిరసించక తప్పదు. భౌతికసిరిసంపదలలో సర్వసమత్వం సాధించడం పాశ్చాత్యకమ్యూనిస్టుల ఆశయం. దాన్ని పొందడానికి వారు యేమార్గమయినప్పటికి అనుసరిస్తారు. దాని మంచిచెడ్డలతో వారికి పనిలేదు. ఫలితమే కావలసింది. ప్రాచ్యులకు అంటే మన భారతీయులకు సమత్వం ఆధ్యాత్మిక చరమలక్ష్యం. కేవలం భౌతిక సిరిసంపదల లోనే కాకుండా, సకలభాగములలో సమత్వం సాధించటం మానవజీవిత పరమావధిగా ఆర్య ధర్మం బోధిస్తున్నది. అందుకు సాధనం మనోవికాసం, ప్రేమ, అహింస. మనంకూడా సమత్వం సాధించవలెననే కోరుతున్నాం. మానవ సౌఖ్యములను అందరు సమానంగా పొందవలెననియే మనకోరిక. మనం ధర్మవికాసమును, ఆత్మైక్యతను ఆధారంచేసికొని పరస్పర సహకారంవల్ల దాన్ని పొందచూస్తున్నాం.

వెంకయ్య—మీరు చెప్పేది అంతా వేదాంతంగా ఉంది. ఈ వేదాంతం కబుర్లు యెవరు వింటారు? కాబట్టే రష్యావాడు నెత్తిమీద దెబ్బకొట్టి, గుండెలకు తుపాకి బారుచేసి, ఒక్క సారి అంతా యేకంచేసి పారవేసినాడు.

నాగయ్య—ఇదంతా వేదాంతం కబుర్లని నీ నోటిగుండా రావడం చాల మంచిదే. ఈ వేదాంతంయొక్క స్థూలరూపం నీవు. ఇచట సేవచేసే వాళ్ళలో నీవు ముఖ్యుడవు. అనేక కష్టాలకీ నష్టాలకీ ఓర్చి, జీతం భత్యంలేకుండా నిరంతరం సేవ చేస్తున్నావు. ఇంకా యితరులుకూడా యిదేవిధంగా నిష్కామసేవ చేసేవాళ్ళు అనేకమంది అన్నిదేశాల్లోను ఉన్నారు గదా! ఇది మనకు అనుభవంలో ఉన్న విషయమేనా?

వెంకయ్య—అవును.

నాగయ్య—ఏ కారణంచేత నీవు యీ సేవావ్రితం పూనావు?

వెంకయ్య—దీనికి కారణం యేమిటి? నాకు చేయాలని బుద్ధి పుట్టింది. చేస్తున్నాను.

నాగయ్య—పోనీ; దీనివల్ల నీకు కలిగే లాభం యేమిటి?

వెంకయ్య—లాభంకోసం చేస్తున్నానా?

నాగయ్య—మరెందుకు?

వెంకయ్య—నాకు ఆపనియందు సరదా.

నాగయ్య—ఈ ప్రికారంగా కష్టాలకోర్చి సేవచేయడం నీకు ఆనందంగా ఉందంటావు.

వెంకయ్య—అవును, నాకు ఆనందమే.

నాగయ్య—ఈ అనుభవజ్ఞానమే సిద్ధాంతరూపంగా మనకు వేదాంతంలో బోధింపబడుతున్నది. వేదాంతం శుష్కమైనదని, అనుభవవ్యతిరిక్తమైందని యెప్పుడు అనుకోవద్దు. మన అనుష్ఠానంలోను, అనుభవంలోను [redacted] దాని స్వరూపస్వభావాదులు తెలియకపోవడంచేత, ధార్మికవిషయాలను గూర్చిన జ్ఞానవికాసం మనకు కలగడంలేదు. అందుచేతనే అన్నివిషయాల్లోను ధర్మం పాలించడానికి వెనకబడుతున్నాం. దేశంకోటకు ప్రాణం అర్పించటానికి, ధర్మం ఆచరించటానికి సిద్ధంగా ఉన్నమనిషి, నిత్యజీవితంలో తోడిమానవులతో చివరకు తల్లితండ్రులతో, ఆలుబిడ్డలతో చేసే వ్యవహారాల్లో ఎన్నో అబద్ధాలు, ఎన్నో మోసాలు చేస్తుంటాడు. ఈ నిదర్శనాలు అనేకం కాంగ్రెసు అనుచరుల్లో కనిపిస్తాయి. కాంగ్రెసుకు సంబంధించినంతవరకు త్యాగానికి, ధర్మానికి వెనుదీయరు. ఇంటి వ్యవహారాల్లో నేమి, గ్రామవ్యవహారాల్లో నేమి మామూలుకక్షలు, దెబ్బలాటలు, అన్యాయాలు చేస్తుంటారు. మహాత్ముడు చెప్పింది ఉద్రేకంవల్ల, వ్యక్తిగౌరవంవల్ల చేస్తారేగాని, ఆయనబోధల తత్త్వం అనుచరులకు బోధపడలేదని స్పష్టమవుతుంది. త్యాగానికి వెనుక ఉన్న ధర్మతత్త్వం బోధపడితే జీవితం అన్నివిషయాల్లో ఒకేమోస్తరుగా నడుస్తుంది. ఇప్పటి మోస్తరు ఉల్లాసీదాలు, పట్టీలు ఉండవు. తత్త్వమే తెలిస్తే యీపాటికే ధర్మరాజ్యం, స్వరాజ్యం అన్నీ స్థాపించబడేవి.

## ౫. సమత్వం.

వెంకయ్య—నిన్న గోష్ఠి సమావేశంలో మీరు చెప్పినట్లు జరుగుతూ ఉన్నమాట వాస్తవమే. మీరు చెప్పిన తత్వం మాత్రం నాకు యిప్పటికి బోధపడలేదు.

నాగయ్య—అయితే కొంచెం వివరించిచెప్తాను. ప్రతిశాస్త్రానికి, ప్రతివిద్యకు సిద్ధాంతభాగమని అనుభవభాగమని రెండుశాఖ లుంటాయి. కేవలం యే ఒక్కటికూడా పూర్ణమైన జ్ఞానం కలిగించదు. ఇప్పుడు వైద్యం ఉంది. కేవలం శాస్త్రం మాత్రమే చదువుకొన్న వైద్యుడు రోగిని, రోగాన్ని చూడగానే భయపడుతాడు. వ్యాధి అనేక రూపభేదాలతో అనుభవంలో కనిపిస్తుంది. దాన్ని గ్రహింపలేక వైద్యుడు ఒకదాని కొకటి అనుకొంటాడు. శాస్త్రజ్ఞానం లేక కేవలం అనుభవంమీద ఆధారపడినవైద్యుడు ఒక కారణం వల్లనే అనేకరూపభేదాలుగల వ్యాధులు కలుగుతా యని తెలియక అన్ని వేరువేరు వ్యాధు లనుకొంటాడు. ఒక జలుబువల్లనే తలనొప్పి, జ్వరం, అగ్నిమాంద్యం, విరేచనాలు యింక యెన్నో కలుగవచ్చు. వీటి అన్నిటికి వేరువేరుగ మందు వేస్తే రోగి ఆఖరు అవుతాడు. శాస్త్రంలో జలుబువల్ల యీలక్షణాలన్నీ కలుగుతాయని వ్రాసి వుంటుంది. కనుక ఒక జలుబుకు చికిత్సచేస్తే యివన్ని టక్కుమని ఆగిపోతాయి.

వెంకయ్య—ధర్మంవిషయంలో ఇదే యేలా వర్తిస్తుందో చెప్పండి.

నాగయ్యా—సమత్వాన్ని విచారిస్తూ యీ డొంకతిరుగుడిలో పడ్డాం. మళ్ళీ దానికి చేరుకుంటేగాని సమన్వయం కుదరదు. నేను చెప్పదలంచిందేమిటంటే: నీవుయితరులకు సేవచేయడంలో ఆనందం ఉందంటున్నావు. కాంగ్రెసు నాయకులు, అనుచరులు, వాలంటీర్లుకూడ దేశంకొరకు లాటీదెబ్బలు తినడంలోను, జైలుకు వెళ్ళడంలోను, ఆస్తినష్టపడడంలోను, ఒక ధర్మం నిర్వహిస్తున్నామనే ఆనందం అనుభవిస్తూనేఉన్నారు. ధీమంతులయిన జ్ఞానులు, తత్త్వవేత్తలు ఈ ఆనందానికి మూలం ఆత్మైక్యంలోను, ధర్మంలోను ఉందంటారు. నీలోను, నీ తోడి మనుష్యులలోను ఒకటే ఆత్మ ఉండడంచేత నీతోడి సోదరుల కష్టనివృత్తికి నీ ప్రాణాన్ని అర్పించమని నీఆత్మ నిన్ను ప్రేరేపిస్తున్నది. ఈ త్యాగంలో ప్రేమ, ఆనందం ఉబుకు తుంటుంది. ఈ ప్రేరణ నీలోనే కాదు, అందరిలోను ఉంటుంది. ఇది ఆత్మలక్షణం. కాని దాని ప్రకటనకు, వికాసానికి స్వార్థం అడ్డువస్తుంటుంది. మనిషి లౌకిక వ్యవహారాల్లో డక్కా మొక్కీలు తిన్నకొద్ది అనుభవజ్ఞానం పొందుతూ మారుతుంటాడు. సత్యాన్వేషియైన వాడు మారి మారి చివరకు తాను, యితరులు ఒకటే అనే సంగతి తెలిసికొంటాడు. తనవలెనే యితరులు కూడ సుఖదుఃఖాలు, ప్రేమానురాగాలు కలిగి ఉన్నారని గ్రహిస్తాడు. ఇదే నెమ్మదిగా సమత్వానికి దారితీస్తుంది. ఈ సమత్వం సిద్ధించేటప్పటికి మనిషిలో స్వార్థం పూర్తిగ సన్నగిలుతుంది. కాబట్టే అనుభవజ్ఞానంతో బాటు ఆధ్యాత్మిక

జ్ఞానంకూడా జోడిస్తే మనం తొందరగా అభివృద్ధిలోకి వస్తామని, జీవితంలో యేకవాక్యత కలుగుతుం దని, దేశాభ్యుదయం సిద్ధిస్తుందని చెప్పటానికి కారణం.

కృష్ణయ్య——దీనికి, కమ్యూనిస్టుల సామ్యవాదానికి భేద మేమి?

నాగయ్య——భేదం చాల ఉంది. పునాదిలోనే భేదం. మనది సుస్థిరమైన మానవాత్మలక్షణాలమీద నిర్మాణమైంది. వాళ్ళది ప్రభుత్వ అధికార శాసనాలమీద నిలబడిఉంది. మనది అంతరమునుండి సహజంగా వికసించేది. వాళ్లది బాహ్యము నుండి బలవంతముగా తెచ్చిపెట్టింది. మనది ప్రేమతోకూడుకొన్నది. అది భయంతో కూడుకొన్నది. మన సమత్వం యొక్క పర్యవసానం ఆత్మానందం. కమ్యూనిస్టుల సమత్వం భౌతిక సుఖాల్లో అంత మొందేది. మనది ఐచ్ఛికం, వాళ్లది బలవంతం.

నరసింహారావు——మీరు చెప్పే సమత్వం యెప్పుడైనా సిద్ధిస్తుందా? వాళ్లది 17 సంవత్సరాలనుండి రష్యాలో అవిచ్ఛిన్నంగా నడుస్తున్నది.

నాగయ్య——రష్యావ్యవహార మంతా గోప్యంగా ఉంది. దాన్ని గురించి చిత్రవిచిత్రమైన కథలు దేశంలో వ్యాపించి ఉన్నాయి. అసలు రక్తపాతంతో బయలు దేరింది ఉద్యమం, విచ్చుకత్తులు, ఫిరంగిగుండ్ల మధ్య పెరిగింది. భావస్వాతంత్ర్యం గాని, క్రియాస్వాతంత్ర్యం గాని జనసామాన్యానికి మొదట లేనే లేదు. చంపుతా రన్న భయమే లేకపోతే యిది యెంత కాలం నడిచేదో ఆలోచించ తగ్గదే.

మానవాత్మలక్షణాలమీద నిర్మాణం కానంతవరకు యే ఉద్యమం కూడా వృద్ధిపొందదు, నిలబడదు. చిన్నపిల్లలకు ఉగ్గుపాలతో కమ్యూనిస్టు సిద్ధాంతాలన్నీ నూరిపోసి యిప్పుడిప్పుడే బందాలు సడలించి ఉదారమైన మార్పులు రష్యాలో కొన్ని చేస్తున్నారని వింటాం. ప్రకృతిసిద్ధమైన భేదలక్షణానికి మనం పూర్తిగ అవకాశం యివ్వవలసి ఉంటుంది. భేదానికి అంతరమున ఉన్న అభేదాన్ని మనం గ్రహించవలెగాని, భేదాన్ని పూర్తిగ తోసిరాజనటానికి వీల్లేదు. మన దేశంలో సంప్రదాయ సిద్ధంగా జీవితానికేమి, సంఘానికేమి భేదాభేదం ఆధారంగా ఉంటూనే ఉంది.

---

## ౬. భేదాభేదం.

నరసింహారావు—సమత్వం ఆత్మలక్షణమని చెప్పుకుంటూవచ్చి చివరకు భేదలక్షణం కూడా సంప్రదాయసిద్ధమైందని చెప్పారు. అది నాకు బోధపడలేదు; మీరు నిరూపించాలని నాకోరిక.

నాగయ్య—అలాగే ఆలోచిద్దాం. భేదం ప్రకృతియొక్క ముఖ్యలక్షణం. అది నామరూపాల్లోనే కాదు, గుణాల్లో కూడ వ్యక్తమవుతుంటుంది. అంతేకాదు; ఒకేజాతి రెండు వస్తువులమధ్య యెంతో భేదం. అలాగే మనుష్యుల్లో భేదం ఉంది. ఒక తల్లికడుపున పుట్టిన యిద్దరిమధ్య భేదం ఉంది; ఆఖరకు కవల పిల్లలలో కూడ భేదం ఉంది. ఇట్లా

సర్వవ్యాపకమయిన భేదలక్షణాన్ని తొలగించుటకు యెవరి తరము? అయినప్పటికి మనుష్యులందరిని ఒక మూసలో పోసి కరిగి ఒక దిమ్మన అచ్చు కొడదా మంటారు. అది సాధ్యమైన పని కాదు. వాంఛనీయం కూడా కాదు. ప్రకృతిలో ఉన్న శోభకు, సౌందర్యానికి భేదలక్షణమే కారణం. ఆలాగే మానవులలో కూడా, అంతశ్శక్తుల వికాసానికి అదే కారణ మవుతున్నది. మనిషి మనిషి మధ్య యెంత భేద మున్నా మానవలక్షణా లందరిలోను ఒకటే. కాకపోతే వానివికాసంలో తారతమ్యం ఉంది. ఈ లక్షణాలే మనను బంధిస్తున్నాయి. భేదాభేదంయొక్క స్వరూపం యిది.

వెంకయ్య—కాని ఈ భేదలక్షణం సంఘంలో యేలా వ్యక్త మవుతున్నదో మనం తెలిసికోవాలె.

నాగయ్య—మన దేశం చాల ప్రాచీనమైన నాగరకత కలది. మత, సాంఘిక రాజకీయ వ్యవస్థలు వందలు, వేలు సంవత్సరాలనుండి పరిణామం చెందుతూ వస్తున్నాయి. మన ప్రాచీన సాంఘికజీవనాన్ని పరిశీలించి చూస్తే, ఇప్పుడున్న భేదభావం, వైషమ్యం అప్పుడులేవని తెలుస్తుంది. ధనికుడు, దరిద్రుడు విషయంలోకూడా భేదం యెక్కువగా ఉందని చెప్పజాలం. గ్రామంలో అన్నికులాలమధ్య పొత్తు, పొందిక ఉంది. పూర్వం ధనికుడయినవాడిదగ్గర ఎంత ధన మున్నా, వాడు సామాన్యుడువలె ఉండేవాడేగాని, యిప్పటివలె ఆడంబరంగా, పటాటోపంగా, గర్వంగా జీవించే

వాడుకాదు. అప్పుడు అవకాశాలు చాల తక్కువగా ఉం డేవి. వర్తకవ్యాపారాలకి, పెద్దవర్తకాలకి, పరిశ్రమలకికూడా అవకాశాలులేవు. అందువల్ల ధనికుడిదగ్గర సొమ్ము సాధా రణంగా ధర్మకార్యాలకే వినియోగపడేది. ముఖ్యంగా చెరువులకు, సత్రాలకు దేవాలయాలకు ఖర్చుపడేది. గ్రామంలోని రైతులు, బీదా బక్కా సామాన్యంగా ఊరు విడిచి బయటికి అప్పుకు వెళ్లేవారు కారు. అప్పుడు వాళ్ళ అవసరాలున్నా ముక్తసరే. మనిషికి ముఖ్యంగా మూడు అవసరా లున్నాయి. కూడు, గుడ్డ, కుటీరం. ఈ మూటికి పూర్వం సాధారణంగా లోపం ఉండేదికాదు. ఇప్పుడు సమ త్వం సాధించటానికి ప్రయత్నం ఈ మూటి విషయం లోనే. ఇక చదువు, జ్ఞానం విషయంలో అప్పటి దేశ కాలస్థితులనుబట్టి ఉండే యేర్పాట్లు ఉన్నాయి. పురాణ కాలక్షేపాలు, హరికథలు, భాగవతాలు, తోలుబొమ్మ ఆటలు.

సుబ్బయ్య—మీరు చెప్పేది ఇప్పటి అనుభవానికి చాల వ్యతి రేకంగా ఉంది. బ్రాహ్మలు తక్కిన జాతులవాళ్లను పశువు ల్లాగ కట్టిపెట్టి, సర్వాధికారం వహించి రాజుల్లాగ భోగా లనుభవించారు. దేశం ఇలా అజ్ఞానంలో ఉండటానికి వాళ్లే కారణం.

నాగయ్య—మనం ఇరవయ్యో శతాబ్దంలో వ్యక్తివైషమ్యాల మధ్య, ఆడంబరంతో కూడుకొన్న కృత్రిమ జీవితాల మధ్య పెరుగుతున్నవాళ్ళం. ఈకళ్లతో రెండుమూడు వందల సంవ

త్సరాలకిందటి స్థితిగతులను తిలకిస్తే చాల రోతగాను భయంకరంగాను ఉండవచ్చు. కాని మీరు సత్యం కనుక్కోవలెనంటె, కొంచెంసేపు యీ బొంది యిక్కడ వదిలివేసి సూక్ష్మశరీరంతో 18 వ శతాబ్దంలోకో, 19 దో శతాబ్దంలోకో వెళ్లవలసి ఉంటుంది. అప్పుడు నిజస్థితి బోధపడుతుంది. ఇప్పటికంటె అప్పుడు గ్రామకట్టడి యెక్కువ. ఇప్పుడున్న కృత్రిమ భేదలక్షణాలు, వైషమ్యాలు, మాత్సర్యాలు అప్పుడు లేవు. నిజానికి, అప్పుడు యెవరికీ డబ్బుతో అవసరమే లేదు. డబ్బుఅవసరం యెప్పుడు లేదో అప్పుడే వైషమ్యం లేదు. జీవితావసరాలకి యెవరికీ లోటు లేదు. ఇక బ్రాహ్మలే చదువుకొని యితరులకు చదువు లేకుండా చేశా రంటారు. చదువుకు యిప్పు డుండే సొమ్ము సంపాదించే విలువ, ఉద్యోగాలు చేసి అధికారం చలాయించే శక్తి, అప్పుడు లేదు. బ్రాహ్మల చదువు కేవలం కర్మకాండలకి, మతానికి సంబంధించింది. ఇతరులకు ఈ చదువుఅవసరం కనిపించలేదు. శాస్త్రాల్లో నిషేధాలు వ్రాసి ఉన్నాయి అని మనకు కోపం. పూర్వం అట్టి మూఢ నమ్మకాలు అందరికి ఉన్నాయి. దాన్ని గురించి మనం యిపుడు వైషమ్యాలు పెంచుకొనుట గతజలసేతుబంధనం.

---

## ౭. మన సంప్రదాయం.

నరసింహారావు —అయితే మనం యిప్పుడు 18, 19 శతాబ్దాల్లోకి వెళ్లవలె నంటూరా?

నాగయ్య—నాకు వెళ్లవలెననే ఉంది.

నరసింహారావు—మీరు నిజంగా అంటున్నారా? ఎగతాళిగ మాట్లాడుతున్నారా? అయినా మీభావం యేమిటో మాకు తెలియచెప్పండి. వీలయితే మేము కూడా మీతో వస్తాం.

నాగయ్య—నా మాటలు మీకు విపరీతంగా కనిపించవచ్చు. అయినా కొంచెం ఆలోచించండి. ప్రతిమనుష్యుడు శాంతి సౌఖ్యం కోరుతాడు. ఎన్ని ఉన్నా ఆరెండు లేకపోతే జీవితం దుఃఖమయమే. పూర్వం గ్రామప్రజల్లో శాంతి, సఖ్యత, సౌఖ్యం ఉన్నాయి. ఇప్పుడు అశాంతి, అసౌఖ్యం, వైషమ్యం రాజ్యం చేస్తున్నాయి. పూర్వం జీవితం నిరాడంబరంగా ఉండేది. అవసరాలు యెక్కువ లేవు. కష్టసుఖాల్లో ఒకరికొకరు ఆదుకొనేవాళ్లు. గ్రామంలో కట్టడి బాగా ఉండేవి. ఇప్పుడు కూడా గ్రామజీవితంలో ఈలక్షణాలు ప్రవేశపెట్టగలిగితే మనం ఆశతాబ్దాల్లోకి వెళ్ళినట్లే.

నరసింహారావు—ఇప్పటికి అప్పటికి జీవితం తల్లకిందుగా మారిపోయె; అవసరాలు పెరిగిపోయె; కష్టాలు యెక్కువాయె; వైషమ్యాలు పెరిగె. ఈ స్థితిలో ఆలక్షణాలను మనం ప్రవేశపెట్టగలమని ఊహించటానికి కూడా వీల్లేదు.

నాగయ్య—కాని ప్రపంచంలో జరిగేప్రయత్నమంతా శాంతీ, సౌఖ్యం నెలకొల్పటానికేగా. రష్యాలో కమ్యూనిజంరూపంలోను, ఇటలీలో ఫాసిజంరూపంలోను, జర్మనీలో

హిట్లరిజంరూపంలోను వాళ్ళవాళ్ళ చిత్తవృత్తుల ననుసరించి వాళ్ల అవసరాలకు వీలయిన విధంగా ప్రయత్నాలు చేస్తున్నారు. అలాగే మనంకూడ మన చిత్తవృత్తులు, దేశ సంప్రదాయాలు, అవసరాలు గమనించి దేశంలో శాంతి, సఖ్యత, సౌఖ్యం పెంపొందించటానికి కృషిచేయవలసి ఉంటుంది. ఇంట గెలిచి రచ్చ గెలువు మన్నారు. కాబట్టి సకల విధాలచేత గ్రామాల్లో మనం శాంతి, సౌఖ్యం స్థాపింప గలిగితే ఎంతో లోకసేవ చేసినవాళ్లం అవుతాం, మనం బాగుపడడమే కాకుండా.

నరసింహారావు—పూర్వ సంప్రదాయాలు ఇప్పుడు మనకు అనుకూలపడతాయా ?

నాగయ్య—పడకపోవచ్చు. కాని వానిని ఆధారం చేసికొని నూతన సంస్థలను నిర్మించుకోవలసి ఉంటుంది. రష్యా, జర్మనీ, ఇటలీపద్ధతులు మనకు అనుకూలపడవు. పూర్వం వలెనే ధనికుల ధనం, బుద్ధిమంతుల తెలివితేటలు, కర్షకుల కృషి సమష్టిసౌఖ్యానికి, జ్ఞానవికాసానికి, ఆత్మోన్నతికి వినియోగపడే నూతనమార్గాలను అన్వేషించుకోవలె.

నరసింహారావు—ఆ మార్గాలేవో తెలియజేస్తారా ?

నాగయ్య—నేను తెలియజేసేది యేమున్నది? మనమే విచారణచేసి పరిస్థితులకు అనుకూలమైన విధానం నిర్మాణం చేసికొందాం.

---

## ౮. నవవిధానం.

దేశదేశాలనుండి కొట్టుకొని వచ్చే భావతరంగాలను అడ్డుపెట్టుటకు ఎవరితరంగాదు. రష్యా నుండి వీస్తున్న గాలిదుమారాన్ని అణచిపెట్టవలె నని దేశదేశ ప్రభుత్వాలు ఊహకు మించిన ప్రయత్నాలు చేస్తున్నాయి. వాళ్ళగాలి సోకకుండా చేయటానికి ఎన్నోనిషేధాజ్ఞలు జారీచేశారు. ఏంచేస్తేనేం, అవి ఏలాగో లోపల ప్రవేశించి మనోవీధుల్లో విహరిస్తూ కల్లోలపెట్టుతున్నాయి. ప్రతిదేశంలోను సోషలిస్టు పార్టీలు బయలుదేరాయి. ఆఖరకు మన దేశంలో కాంగ్రెసులో ఒక శాఖ బయలుదేరింది. ఈ శాఖ పెరుగుతుందో విరుగుతుందో తెలియదు. ఇది చేవగలదో పెళుసుదో ఒక ఊపుఊగితేగాని బయటపడదు.

ఎవళ్లో కొందఱు భావోన్మాదులు, ఉద్రేకపరులూ ఎక్కడా ఉంటూనే ఉంటారు. కాని ప్రజ లందరు వెఱ్ఱివెంకటాయలు మాత్రం యెప్పుడూ కారు. ప్రస్తుతం ఉండే దైన్యంలో, దారిద్ర్యంలో యిదే యదనుగదా అని ప్రజల్లో సామ్యవాద సిద్ధాంతాలను ప్రచారం చేయటానికి కొందరు పూనుకొన్నారు. వాళ్ల ఉద్దేశం శుద్ధమైందే కావచ్చు. దాని సాధకబాధకాలు కూడ ప్రజలు తెలిసికోవలెననే నాగయ్య యిన్నాళ్లనుండి విషయమంతా శాంతంగా బోధపరచాడు. నిజానికి సంస్కారాలు అవసరం కలిగినప్పుడే అనుష్ఠానంలోకి వస్తుంటాయి; వ్యాప్తిచెందుతాయి. ప్రస్తుతంఉండే దుర్భర పరిస్థితుల్లో బయటపడేమార్గం కోసం అందరు పరితపిస్తున్నారు. 'ధనికుడేమిటి- దరిద్రుడేమిటి? ఉన్నదేమిటో అందరు పంచుకొంటే సరిపోతుం'దని సులభంగా

తోస్తుంది కొంతమందికి. కాని ఇది సహజం, సాధ్యం అయిన మార్గంమాత్రం కాదు. రష్యాలోవలె దండనభయం ఉంటేనే సాగుతుంది. అప్పుడయినా, భయం తీరి ప్రజల్లో ధైర్యసాహసా లేర్పడితే, ఇదినిలుస్తుందని చెప్పజాలం. మరొక క్రొత్తవిప్లవం కాచుకొనే ఉంటుంది. యుద్ధం యుద్ధాన్ని, విప్లవం విప్లవాన్ని, ద్వేషం ద్వేషాన్ని పురిగొల్పడం నైసర్గికధర్మం. ధర్మపన్నాలు యెన్ని చెప్పినా, మాటలతో ఉపశాంతి గలగదుగదా. వాళ్లకు గట్టికేక మార్గం కావలె. కర్తవ్యం నిర్ణయించుకోటానికి మరల అందరు సమావేశమయినారు.

నాగయ్య—మనం మన దేశీయసంప్రదాయాలకుఅనుకూలమైన మార్గం నిర్ణయించుకొనుటకు చేరాం. సమష్టివాదమని, సామ్యవాదమని ఎన్నిగంతులు వేసినా మన జీవితకాలంలో వానివల్ల యిసుమంతైనా లాభం కలుగుతుందని నాకు నమ్మకంలేదు. ప్రస్తుతస్థితిలో కొంతవరకైనా సాధ్యపడే మార్గం కావాలె. పీక యెండుకపోయి చస్తుంటే నుయ్యి త్రవ్వుతున్నామంటె లాభం యేమిటి?

కృష్ణయ్య—సరే, మార్గం చెప్పండి.

నాగయ్య—కష్టానికి, సుఖానికి మన మందరం ఒక సంఘంగా యేర్పడవలె. మన వ్యవహారా లన్ని సంఘంద్వారా జరగాలి. మన ఆస్తియావత్తు స్థిరచరం కూడా సంఘందిగానే ఉండవలె. కాని ఆస్తిహక్కును మీరు వదలుకోమని చెప్పడం లేదు. ఆస్తి అన్యాక్రాంతం చేయకుండా ఉండవలె నని నా ఉద్దేశం.

రామయ్య—కేవలం పొలాలు మాత్రం సంఘంలో చేర్పిస్తే చాలదా?

నాగయ్య—అలాగూ చేయవచ్చు. ఇది సమష్టిశిక్ష కొరకు యేర్పాటు చేసికోవలెనని నా అభిప్రాయం. పోనీ, పొలాలే సంఘంలో చేరుద్దాం. పొలాలను ఫలసాయాన్నిబట్టి ఖరీదు కట్టి దాన్ని వాటాధనంగా నిర్ణయించుకొందాం.

వెంకటామయ్య—తాకట్టు ఉన్న పొలాలో?

నాగయ్య—భూములకు న్యాయమైన ధరకట్టి ఆ సొమ్ముతో బాకీ తీరేయెడల, ఆ మొత్తం సంఘం చెల్లించి పొలాలు ఉంచుకొంటుంది.

వెంకటామయ్య—సంఘానికి సొమ్మేది?

నాగయ్య—సంఘం మూలధనంమీద ఇతర బ్యాంకులనుండి అప్పు తెస్తుంది. సంఘం డిపాజిట్లు తీసికొంటుంది. సంఘం పొలాలమీద వచ్చే ఆదాయంలో వాటాదార్లు స్వంత ఖర్చులకు తీసికొన్నది పోను కొంత నిలవ చేరుతుంటుంది. ఈ మాదిరిగా చేరిన సొమ్ముతో ఋణాలు తీర్చటానికి అవకాశం ఉంది.

రామయ్య—సంఘం తాకట్లు వదలించి తీసికొన్న భూములను యేం చేస్తుంది?

నాగయ్య—భూమి ఖామందు యితర మార్గాలవల్ల సొమ్ము సంపాదించి అప్పు తీరిస్తే భూమిహక్కును తిరిగి అతనికి యిచ్చివేస్తుంది. లేదా, ఫలసాయంవల్ల ఎన్ని సంవత్స రాల్లో అప్పుతీర్చటానికి వీలవుతుందో అంతకాలం పొలాలు

ఉంచుకొని, పిమ్మట భూమిహక్కును వదులుకొంటుంది. సాధ్యమైనంతవరకు రైతుకు సహాయం చేయడమే మన ఉద్దేశం; దానివల్ల నష్టం వచ్చినా సమష్టిమీద భరిస్తాం.

కృష్ణయ్య—ఈ భూములు ఎవరు సేద్యం చేస్తారు?

నాగయ్య—ఈ భూములను తిరిగి భూమిఖామందులు కవులుకు తీసికొని ఎవరిభూములను వారు సేద్యం చేసికోవచ్చు. ఫలసాయం సంఘానికి ఒప్పచెప్పి, కష్టంకిౚంద కొంత పుచ్చుకోవచ్చు; ఇది ఒక పద్ధతి.

కృష్ణయ్య—మీరు చెప్పిన విధానంలో లీగలుచిక్కులుచాల ఉన్నాయి.

నాగయ్య—ఒకమార్గం సూచించాను. లాప్రికారం కలిగే చిక్కులను శాసనాలద్వారా సవరించుకోవచ్చు.

రామయ్య—ఋణాలు సమష్టిగా తీర్చమన్నావు సరే. ఆదాయం వృద్ధి అయ్యే మార్గం యేమిటి?

నాగయ్య—మనకు యిప్పుడు సాగుబడిఖర్చులు చాలయెక్కువ అవుతున్నాయి. ఎవరికి వారు వ్యవసాయం చేయడంవల్ల యిప్పుడు మనకు ఖర్చులు యెక్కువగుతున్నాయి. పన్నులు, ఖర్చులు, యేకమై ఆదాయాన్ని మిృంగివేస్తున్నాయి. పన్నులు తగ్గించడానికి మనకు శక్తి చాలకుండా ఉంది. మన మొర అరణ్యరోదనం అవుతున్నది. ఖర్చులు తగ్గించుకోడం మనచేతిలోని విషయం. ఇది చేయగలిగితే రెండవది సులభంగానే చేయవచ్చు. అంటె సంఘశక్తి కావాలె.

కృష్ణయ్య—సోషలిజం సంఘశక్తే.

నాగయ్య—మనం నిర్మాణం చేయదలచుకొన్న సంఘశక్తికి ప్రేమ, సహకారం ఆధారం. కొన్ని కొన్ని అవసరాల్లో కలిసి పనిచేయడంవల్ల సంఘశక్తి సాధనలోకి వస్తుంది. ఇప్పుడు ఖర్చులు తగ్గించడం అవసరం. మనసంఘశక్తిని ప్రయోగించడానికి యిది మంచి అవకాశం. అయిదు, పది, యెకరాలు ఉన్నవాడు కూడా బండి, యెడ్లు, వ్యవసాయం పనిముట్లు అన్ని సమకూర్చుకోవలసి వస్తున్నది. ఇందుకు పెట్టుబడి కావలె. బండియెడ్లకు యెప్పుడు పని ఉండదు. మేతమాత్రం తప్పదు. పోటీపడి ఊడ్పులు చేయడంలోను, కోతలు కోయడంలోను ఖర్చులు పెరుగుతున్నాయి. పొలాలకి నీళ్లుపెట్టడంలో పోటీపడి లంచాలు పెట్టవలసివస్తోంది. ఇవ్విధంగా ఖర్చులు పెరిగిపోతున్నాయి. సమష్టిగా సంఘం తరఫున భూములను వ్యవసాయం చేయించేపక్షంలో యీ ఖర్చులు సగానికి తగ్గుతాయి. ఊళ్లో జనమే ఊడ్పులకు, కోతలకు పనిచేయవచ్చు. దానివల్ల గ్రామస్థులకు కొంత సంపాదన యేర్పడుతుంది. ప్రతిరైతు బండ్లను, యెడ్లను, పనిముట్లను కొని ఉంచుకోనక్కరలేదు. భూమియావత్తుకు కావలసిన యెడ్లను, బండ్లను, పనిముట్లను సంఘమే జాగ్రత పెడుతుంది. బాహుళ్యంమీద పనికివచ్చే నూతనసాధనాలు ఉపయోగపరచి ఖర్చులు తగ్గిస్తుంది. ఈ పరిస్థితులు మనకే కాదు, ఇటలీ, జపాను, అమెరికా దేశాలకూ వచ్చినాయి. వాళ్లు సమష్టివ్యవసాయంవల్ల చాల బాగుపడ్డారు.

వెంకటామిమయ్య.—భూములను సంఘంలో చేర్చకుండా మాత్రం యిటువంటి యేర్పాటు చేసికొని ఖర్చులు దామాషాను పంచుకోకూడదా.

నాగయ్య—ఎందుకు చేయకూడదూ? చేయవచ్చు. మనకు కలిసి చేసికొందామనే బుద్ధి ఉండాలేగాని బాగుపడడానికి యెన్నోమార్గాలు ఉన్నాయి. ఏపనికైనా, ఒక అంగనిర్మాణం, ఒక సంఘం ఉండడం మంచిది. అంటె గ్రామానికి సంబంధించిన చిల్లరకూలిపనులు, నాట్లు, కోతలు, నూర్పిళ్లు నిర్వహించడానికి, ఒకసహకార కార్మిక సంఘం కూలి చేయు వాళ్లందరు కలిసి యేర్పాటు చేసికోవచ్చు. వాళ్ల అవసరాలకు, అక్కరలకు ఆ సంఘం ఆదుకొంటుంది.

రామయ్య—పంట యే మవుతుంది?

నాగయ్య—పంట యావత్తు సంఘానికే చేరుతుంది.

సుబ్బయ్య—శిస్తులూ?

వెంకయ్య—మనకేం పనిలేదు. అన్నీ సంఘమే చేస్తుంది. దానిదే బాధ్యత.

వెంకటామిమయ్య—మనకేం పనిలేకపోవడం యేమిటి?

వెంకయ్య—అవును. పొరబాటేనాది. సంఘం అంటే మనమేగా! అన్ని పనులు మనమే చేస్తాం. పన్నులు మనమే చెల్లిస్తాం; పంటలు మనమే వసూలు చేస్తాం; పనులన్ని మనలో మనమే పంచుకొంటాం, లేదా ఉద్యోగులను యేర్పాటు చేస్తాం.

నాగయ్య—పంటవిషయంలో మనం ఆలోచించవలసిన సంగతులు కొన్ని ఉన్నాయి.

రామయ్య—సరే, గాని. డెల్టా గ్రామాల్లో వరిపంట బొత్తుగ గిట్టుబాటుగా లేదు. దానికి బదులీ యేమీ కనిపించదు.

నాగయ్య—ఈ పనిని ప్రత్యేకవ్యక్తులకంటె సంఘమే సులభంగా చేస్తుంది. గవర్నమెంటుకు వ్రాసి వ్యవసాయశాఖో ద్యోగులను పిలిపించి భూమి తనిఖీ చేయించి యే విధంగా పంటలు మార్చవచ్చునో తెలిసికొంటుంది. అవసరమైన మార్పులు చేస్తుంది. పంట వృద్ధి పొందిస్తుంది.

సుబ్బయ్య—దానివల్ల రైతు కేమి లాభం?

నాగయ్య—ఖర్చులు సంఘం భరిస్తుంది. లాభం కూడా సంఘానికి వస్తుంది. ఆ లాభం మనం పంచుకొంటాం.

వెంకయ్య—అది ఆలా ఉంచండీ. ఇప్పుడు పండించే పంటకు మంచి ధర వచ్చే మార్గా లున్నాయా?

నాగయ్య—లేకేం. ఈ పంటలు పండించడంలో మనకు ఒక దారి తెన్ను లేదు. మంచిరకాలు పండించడం అవసరం. చిల్లరమల్లర రకాలు పండిస్తే ధర రాదు. సరియైన కాలంలో మొత్తంమీద అమ్మాలె. ఈపని సమష్టిగా నెరవేరినట్టు వ్యక్తులవల్ల నెరవేరదు. ఇప్పుడు వర్తకుడు యేదో పేరు పెట్టి రైతు రైతుకు ధర మారుస్తున్నాడు. తూకంలో మోసం చేస్తున్నాడు. ఇవి ముందు జరగటానికి వీలుండదు. ఇప్పుడు శిస్తులకీ, ఖర్చులకీ సొమ్ము లేక అయినకాడికి అమ్ముకొంటున్నాం. సంఘానికి సొమ్ము ఉంటుంది గనుక తొందరపడి అమ్ముకోవలసిన అవసరం ఉండదు.

వెం. రామయ్య—అమ్మకం, కొనుగోలు సహకార సంఘాలు న్నాయిగా?

నాగయ్య—ఉన్నమాట వాస్తవమే. మనమైన అటువంటి సంఘాలద్వారానే యీ వ్యాపారం నడిపించాలె. మన సంఘం యీ పనులన్ని తననెత్తిన పెట్టుకోదు. అన్నిటికి కేంద్రసంఘంగా మాత్రం ఉండి గ్రామవ్యవహారాలు నడిపిస్తుంది. అలాగే సభ్యులకు చిల్లర అప్పులు కావలసివస్తే తాను యివ్వదు. వేరే పరపతి సంఘం యేర్పాటు చేస్తారు. దానిద్వారా అప్పుల వ్యాపారం జరుగుతుంది. కేంద్ర సంఘంలోని ఆస్తి యితరసంఘాలద్వారా సంఘసభ్యులు జరుపుకొనే వ్యవహారా లన్నిటికి పూచీగా ఉంటుంది.

కృష్ణయ్య—ఈ విధానంవల్ల ప్రయోజనం యేమిటి?

నాగయ్య—ప్రయోజనాలు యిదివరకే వివరించాను. వ్యష్టిగా (ఎవరికి వారే) జీవించడంవల్ల మన మేవిధమైన అభివృద్ధిలేక కూపస్థమండూకాలవలె జీవిస్తున్నాం. మన పిల్లలకి సరియైన చదువు చెప్పించుకోలేకుండా ఉన్నాం. మన గ్రామారోగ్యం వృద్ధిచేసికొనే వీలు కనిపించదు. వైద్యసహాయం లేదు. ప్రసవాలకు మంచి మంత్రసానులు లేరు. మన ప్రపంచజ్ఞానం అభివృద్ధి చేసికోటానికి మంచి పఠనమందిరం లేదు. గ్రామక్షేమానికి సంబంధించిన పను లెన్నో యిదివరలో సొమ్ము లేక కొరవడి ఉన్నాయి. పంచాయితీ ఉన్నా ప్రయోజనం లేకుండా ఉన్నది. మన సంఘంలోనుండి యీ కార్యాలన్నిటికి కొంత ఖర్చు చేసికోటానికి మనకు అవ

కాలం యేర్పడుతుంది. గవర్నమెంటు కూడా గ్రాంటు యిస్తుంది. మనలో కలయిక లేకపోవడంవల్ల గవర్నమెంటు నుండీ, గవర్నమెంటు ఉద్యోగులనుండీ తగిన సహాయం పొందలేకుండా ఉన్నాం. దేశానికి తగిన ప్రతిఫలం లేకుండా మన సొమ్ము ఉద్యోగుల క్రింద చాల వ్యర్థమై పోతోంది. వీరినుండి మనం పని పుచ్చుకోవలెనంటె మన హక్కులను, మన లోటుపాటులను బాగా తెలిసికొని ఉండాలి. వ్యక్తులు వీనిని సరీగా గ్రహించి వ్యక్తం చేయలేరు. సంఘం చేస్తుంది. సంఘం వెనుక గ్రామ మంతా నిలబడి ఉంటుంది. అందువల్ల ఉద్యోగులు తలాయించడానికిగాని, నిర్లక్ష్యం చేయడానికిగాని ధైర్యం ఉండదు. కట్టడి యేర్పడుతుంది.

---

## ౯. అంకురార్పణ.

వెం. రామయ్య—మిక్కిలి సావధానంగా మనం యిన్నాళ్లు నుండి మన స్థితిగతులను సాకల్యంగా విచారించుకొన్నాం. మనం యిప్పుడుండే పరిస్థితుల్లో సమష్టిప్రయత్నాలు ఫలించినట్టు వ్యక్తిప్రయత్నాలు లాభింపవని మనకు నాగయ్యా గారు చక్కగా విశదపరిచారు. ఆయన వయస్సున చాల చిన్నవాడేగాని, చెప్పిన సలహాలు చాల అనుభవజ్ఞానం తోను, దూరదృష్టితోను కూడుకొన్నవని చెప్పకతప్పదు. కేవలం ఉద్రేకపరుడు కాడు. ఆయన సూచించిన పద్ధతులు

కూడ ప్రభుత్వం ఆమోదించి ప్రవేశ పెట్టవలెనని ఆలో చిస్తున్న వేగాని విపరీతమైనవికావు. మనం యిప్పుడు సంఘంగా యేర్పడడం చాల అవసరం. దానివల్ల మనలో ప్రతి ఒకరికిని, సమష్టిగా గ్రామానికినీ లాభంఉంది. ఎవరిఆస్తికీ యేవిధంగానూ నష్టం లేకపోగా లాభమే కలుగుతుంది.

నాగయ్య—ఇదివరలో మనం స్వార్థజీవితం జీవించాం. దాని వల్ల కష్టాల్లో, సుఖాల్లో ఒకరి సహాయం ఒకరికి లేకుండా పోయింది. సమష్టిగా వచ్చిన విపత్తుల్లో తట్టుకో లేకుండా నలిగిపోతున్నాం. పదిమందితో చావుపెళ్లితో సమాన మన్నట్టు కష్టమో సుఖమో అందరితో కలిసి అనుభవిం చడంలో యెక్కువ ఆనందం ఉందని మనకు యిప్పుడు తెలుస్తూనేఉంది. ఎంతఆస్తి ఉన్నా మనిషికి కావలసినఅవ సరాలు కొద్దే. కాని అంతమాత్రంతో జీవితం ముగియ డంలేదు. మనిషి సాంఘికజీవి కావడంవల్ల యితరులతో కలిసి జీవించడానికి సహజమైన ప్రేరణ కలిగిఉంటాడు. ఒక వైపున స్వార్థం వెనక్కిలాగుతుంటె ఆత్మ ముందుకు తోస్తుంది. కనుక ముందుకే అడుగువేయవలసి ఉంటుంది. నేను, నాభార్యకూడా మా ఆస్తితో యీ సంఘంలో చేరు తాం. వెంకట్రామయ్యగారు ఒప్పుకొన్నారు. పెద్దా చిన్నా కుల తారతమ్యం లేకుండా అందరు చేరవలెనని నా కోరిక. వెంకటాద్రిమయ్యగారు ఈ విషయంలో యెక్కువ అనుభ వం కలవారు. ఆయన దీనికి సంబంధించిన వ్యవహారమంతా నడిపిస్తారు. ఒక విషయంమాత్రం మనం యెప్పుడూ మరిచి

పోకూడదు. సంఘంతోను అందలిసభ్యులతోను ప్రతిఒకరు ఐక్యంకావాలి. పదవులకోసం యెవరు పెనుగులాడకూడదు. కక్షలకు సందు యివ్వవద్దు. ఇది గ్రామోద్ధరణకు చేయబడే మహాయజ్ఞకార్యంగా భావించి యథాశక్తిని తోడ్పడటానికి అందరు ముందంజవేయాలి.

సుమారు 50 మంది ప్రారంభ సభ్యులుగా చేరారు. దాదాపు అయిదు వందల యెకరాలు కేంద్రసంఘంలో చేరింది. దీనికి ఉపసంఘాలుగా ఒక అప్పులిచ్చే పరపతి సంఘం, కూలి పనులు నిర్వహించే కార్మికసంఘం, అమ్మకం కొనుగోలు జరిపే క్రియవిక్రియసంఘం, నిత్యఅవసరాలు సప్లయిచేసే స్టోర్సు నెమ్మదిగా యేర్పడ్డాయి. క్రమంగా అనుభవం కలిగిన కొద్దీ విధాన ముందు ప్రజలకు నమ్మకం కలిగింది. సమష్టి వ్యవసాయం ప్రారంభించారు. తోటలు, చెరుకు వృద్ధి చేశారు. రైతులు ప్రత్యేకం యెడ్లు బండ్లు తీసివేసికొన్నారు. కాయకష్టం చేయ గలవాళ్లు కార్మికసంఘంలో చేరి సొమ్ము సంపాదించుకొంటు న్నారు. సంఘం తరఫున వ్యవసాయ పనులే కాకుండా లోకలు బోర్డు రోడ్డుపనులు, త్రవ్వుపనులు, మరమ్మతులు, కంట్రాక్టు పనులు కూడా చేస్తున్నారు. ఇందు మూలంగా భూమి లేని వాళ్లకు మంచి ఆదాయం యేర్పడింది.

సమష్టిసూత్రాన్ని అంగీకరించడం వల్ల కుల తారతమ్యం లేకుండా కష్టసుఖాల్లో అందరు కలిసి యేక కుటుంబంగా యేర్పడడం తటస్థించింది. ప్రతివాళ్ల జన్మహక్కులు స్థిరపడ్డాయి. పాటకపు జనుల ప్రాముఖ్యం బాగా వ్యక్తమైంది.

కార్మిక సంఘంలో పంచములతో సహా అన్నికులాలవాళ్లూ సభ్యులే. సంఘం ద్వారా నౌకరీచేయడం ఒక మర్యాదగా యేర్పడింది. ప్రత్యేక భూస్వాముల ఆగ్రహానుగ్రహాలకు తల వంచవలసిన అవసరం తీరిపోయింది. ముఖ్యంగా పంచములేమి, యితర బీదజనులేమి ఆర్థికంగా చాల అన్యాయం పొందుతుండేవాళ్లు. గ్రామంలో కోమటిదుకాణానికి వెళ్ళితే కానీవస్తువు అర్ధణాకు, అణాకు కొనుక్కోవలసివస్తుండేది. పాపం! వాళ్ళు కష్టపడి తెచ్చుకొన్న పావలాడబ్బులకు కూడా న్యాయంగా ముట్టవలసిన సరుకు ముట్టేదికాదు. ఇప్పుడు సంఘం దుకాణంలో (స్టోర్సు) అన్ని వస్తువులు న్యాయమైన ధరలకు లభిస్తున్నాయి. సంఘంలోనుండి వాళ్ళకు కావలసిన బట్టలు కూలికి బదులు యివ్వడం యేర్పాటుచేశారు. నూలు వడుకొనే వాళ్లకు ఏకులు యిచ్చి, బట్టలు నేయించి పెట్టుతున్నారు. ఈ రూపేణ ఆర్థికస్థితి చాలవరకు బాగుపడ్డది.

అంతేగాకుండా రైతులు ఉపవృత్తులవల్లకూడా తమ ఆదాయాన్ని వృద్ధి చేసికొంటున్నారు. ఎడ్ల అవసరం తగ్గిపోవడంవల్ల రైతులు పాడిపశువులను వృద్ధిచేసికొన్నారు. దీని మూలాన పాలువెన్నసరఫరా సంఘం యేర్పడింది. ఈసంఘంద్వారా బెజవాడకు నికరమైన పాలు, పెరుగు, వెన్న యెగుమతి అవుతున్నది. చెరుకుపంట, తోటలు వృద్ధిపొందడం వల్ల దానికి ఉపవృత్తిగా తేనెటీగలను పెంచి కలితీలేని మంచి తేనె తయారు చేస్తున్నారు. కొందరు కోళ్లను మేకలను పెంచుతున్నారు: ఇవ్విధంగా స్త్రీ పురుషులకు తమతమ కాలాన్ని

సద్వినియోగం చేయుటకు అవకాశం యేర్పడింది. ఇంకా ఉన్న విరామకాలం విజ్ఞానాభివృద్ధికి వినియోగించుకొంటున్నారు.

నాట్లు, కోతలు, నూర్పిళ్ల సమయాల్లోమాత్రం గ్రామస్థులందరు వంతులప్రకారం నియమితకార్యాలు నిర్వహించి సాధ్యమైనంతవరకు బైటకూలీల అవసరంలేకుండా చేసికొంటున్నారు. ఇతర సమయాల్లో వాళ్లవీలునుబట్టి, అనసరాన్నిపట్టి పనిచేస్తున్నారు.

---

## ౧౦. నవజీవనం.

ఏవూరు యిప్పుడు ఆదర్శగ్రామమైంది. గ్రామంలో యెవరికి ఋణబాధ లేదు. దాదాపుగ లక్షరూపాయల ఋణం కేంద్రసంఘం స్వంతపూచీ మీద తీర్చింది. సంఘం భూమి కూడా పెరిగింది. రైతులు సాలుఖర్చులు పోగా మిగతాసొమ్ము ఋణ తీర్మానం క్రింద యిచ్చివేయడంచేత, సభ్యులు, తమ ఆదాయాన్ని సంఘంలో నిలువచేసి కోటంచేత, రాజధాని బ్యాంకులో సంఘం ఋణతీర్మానం నిమిత్తం తెచ్చిన అప్పు త్వరలోనే తీర్చివేయ గలిగింది. రైతులకు ఖర్చులు చాల తగ్గిపోయినాయి. సంఘం భూముల మీదను, యితరపనుల మీదను యితరబీదజనులు, కొద్ది రైతులు కష్టపడి సంపాదించుకొంటున్నారు. ఏ పనీ న్యూనత కాదను భావం క్రమంగా వ్యాపిస్తున్నది. దుర్వ్యసనాలు, జూదాలు, జువ్వాలు, వ్యాజ్యాలు దెబ్బలాటలు, క్రిమినలు కేసులు, వీనికోసం, పట్నాల చుట్టూ

తిరగడం, కాఫీహోటళ్లు, సినీమాలు అన్ని వదలిపోయి గ్రామ జీవనమే ఆధ్యాత్మిక జీవనంగా పరిణమించింది.

గ్రామానికి కావలసిన వస్తువులు సంఘంద్వారా కొనడం వల్లను, గ్రామంతాలూకు పంటసరకులు సంఘంద్వారా అమ్మడం వల్లను, ఆదాయంవృద్ధిపొందుటకు ఖర్చు తగ్గుటకు అవకాశం కలిగింది. గ్రామంలోని నిర్వ్యాపారత్వం, తిండి లేకపోవడం, తీరిపోయినాయి. జీవనాధారం లేని బీదవాళ్ళకు మాలవాళ్ళకు పనులు దొరికి సుఖజీవనం చేస్తున్నారు. అసంతృప్తికి వీలయినంతవరకు అవకాశం లేకుండా చేయడం లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తున్నారు.

ఇంకా, పంటల నూర్పిళ్ళవల్ల, తోటలు వృద్ధిచేయడంవల్ల, అమ్మకం కొనుగోలు విషయాల్లో సహకారపద్ధతులు ప్రవేశపెట్టటంచేత మామూలుకంటె గ్రామమొత్తంమీద ఆదాయం చాల హెచ్చింది. ఇది వాటాధనంమీద పంచుకొనుటవల్ల అందరికి లాభం కలిగింది. సమష్టి పద్ధతులవల్ల వచ్చిన లాభంలో కొంతభాగం గ్రామం సమష్టి సౌభాగ్యానికి వినియోగిస్తున్నారు. ఇందుమూలకంగా సాలుకు నాలుగైదు వేలు గ్రామోపయోగం నిమిత్తం లభిస్తున్నాయి. ఈ సొమ్ముతో స్కూలు, ఆస్పత్రి, రీడింగురూము, సినీమా, క్లబ్బు మొదలయినవి యేర్పాటుచేశారు. గ్రామపారిశుద్ధ్యం యిదివరకే వృద్ధిచేశారు. పట్టణానికి, గ్రామానికి ఉండే భేదం తగ్గించి ఆవ్యామోహం ప్రజలకు కలగకుండా చేయడం అవసరమని నాగయ్య ఉద్దేశం. అందువల్లనే వీని నన్నిటిని ప్రవేశ

పెట్టాడు. బస్తీలో యివన్ని దారి డొంక లేక, మంచి ఆదర్శం లేక వినోదవిలాసాలకు తోడ్పడుతున్నాయి. ఏవూరిలో యివి గ్రామస్థులయొక్క విజ్ఞానానికి, వినోదానికి కలిసివచ్చేవిధంగా కట్టుదిట్టాలతో సంఘమే ఒక బోర్డును యేర్పాటుచేసి నడిపిస్తున్నది. బస్తీ సినిమాలు ప్రజల మనస్సులమీద యెట్టి విపరీత ఫలితాలు కలిగిస్తున్నాయో చెప్పలేం. ఫోటోగ్రఫుయొక్క మాయా సృష్టి నిజంగా జరిగేదే అని ప్రజలు మోసపోతున్నారు. ఇవి మనుష్యుల్లో కలిగించే చిత్తవిభ్రాంతి, ఉద్రేకం, యితర మనోవికారాలు సంఘశ్రేయానికి చాల భంగకరంగా ఉన్నాయి. ఈ ప్రమాదాన్ని తప్పించి సినిమాను ఉత్తమోపయోగానికి తీసికొనివచ్చి ప్రజల్లో ప్రాపంచికజ్ఞానం వృద్ధిచేయడానికి పూనుకొన్నారు.

ఇదే విధంగా యితర జాతీయములైన చెడుగుడు, చెర్పట్టి మొదలయిన ఆటలు, క్రీడలు, కవాతులు, కసరత్తులు, సాముగరిడీలు, కుస్తీలు, యితర సంఘీభావము పురిగొల్పే ఆటలు గ్రామంలో ప్రవేశపెట్టారు.

ఈ నానావిధములయిన సాధనలవల్ల సాంఘికంగా గ్రామంలో సమానప్రతిపత్తికి మార్గం యేర్పడింది. సమష్టిగా జరిగే అన్ని వినోదాలకు, ఆటలకు, పాటలకు, ప్రార్థనలకు, ఉత్సవాలకు, సభలకు అందరు శుచిగా శుభ్రమైన బట్టలతో రావడం నాగయ్య అలవాటు చేశాడు. పంచములను విధిగా రప్పించి వాళ్ళలో ఆత్మగౌరవం కలిగించాడు. గ్రామంలోని

పాఠశాలలకు అందరు వచ్చి చదువుకొంటున్నారు. పిల్లలకు పూర్వం ఉండే చిన్న చిన్న పనులు తప్పిపోయినాయి. పంచమ బాలబాలికలు బడికి పోయి చదువుకొనుటకు కావలసిన ప్రోత్సాహం నాగయ్య బహుమానాలరూపంగా కలుగజేశాడు. నూతనంగా యేర్పడ్డ సమష్టిసంస్థ లన్నిటికి పంచములకు ప్రవేశం ఉంది. పూర్వకాలపు దేవాలయాలు, సత్రాలు మొదలయిన వాటివిషయంలో మాత్రం నాగయ్య జోక్యం కలుగజేసికోలేదు. వాళ్లు యిళ్లు వాకిళ్ళు శుభ్రంగా ఉంచుకొంటున్నారు. వాళ్ళ కులవృత్తినికూడా శుచిగా చేయడం నేర్చుకొన్నారు. మృత కళేబరాలమాంసం తినడం పూర్తిగ మానివేసినారు. నిరంతరం అందరితో కలిసి ఉండడంవల్ల, గౌరవమైన సభ్యత్వం యేర్పడడంవల్లనుకూడా వాళ్లలో నూతన పరివర్తనం కలిగి, తమ గౌరవం కాపాడుకోవలెననే ప్రతిష్ఠ యేర్పడింది. ఈ విధంగా అంతరమునుండి కలిగిన వికాసం, చైతన్యం ప్రభావములవల్ల ఏవూరు పంచములు చాల సంస్కారం పొంది మహాత్ముడొసగిన నూతన హరిజన నామానికి అర్హతను పొందారని చెప్పటానికి ఆశ్చర్యం లేదు.

హరిజనసమస్యను నాగయ్య మొదటినుండి ప్రత్యేకంగా పేరుపెట్టి రచ్చకెక్కించలేదు. పేరుపెట్టితే చిక్కులు వస్తాయని మానివేశాడు. గ్రామ సమష్టి సౌభాగ్యంలో అందరితోబాటు హరిజనులు చేరివున్నారు. ఆర్థికవిషయాల్లోనేమి, గ్రామారోగ్యం విషయాల్లోనేమి, విజ్ఞానాభివృద్ధి విషయాల్లోనేమి అందరితోపాటు వాళ్ళను కలిపి పరిశీలించడం మొదటినుండి

వస్తూవుండడంచేత ప్రత్యేకంగా విచారించవలసిన అగత్యం కలుగలేదు. సమష్టిదృష్టితో అన్నీ చూడడం అభ్యాసం అయితే గాని గ్రామజీవనం సర్వతోముఖంగా వికాసం చెందదని యేపూరు అన్నిఊళ్లకు బోధిస్తోంది.

ఇక విద్యావిషయం విచారిద్దాం. గ్రామంలోనిబడి చదువు పిల్లలకు యేమి ఉపయోగంగా లేదు. జీవితంతో సంబంధంలేని చదువు దేశానికి కలిగించిననష్టం చాల అపారంగా ఉంది. జాతిలో నూతన జీవితం, వికాసం, చైతన్యం ప్రవేశపెట్టడానికి విద్యే ప్రధానసాధనం. ఇప్పుడున్న విద్యాశకటాన్ని మామూలు రస్తానుండి తప్పించటానికి విశ్వప్రయత్నం జరగవలసిఉంది. ఒకవైపునుండి జిల్లాబోర్డులు, మరొకవైపునుండి గవర్నమెంటూ విద్యను నులిమివేస్తున్నారు. ఈ ద్వంద్వ పరిపాలన మధ్య నలిగి పోతున్న మన పసిబిడ్డల దౌర్భాగ్యాన్ని తెలిసికోలేని అజ్ఞానాంధకారంలో మనం ఉన్నాం. జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు, మెంబర్లు తమ ఆశ్రితులయిన బుక్కు-పబ్లిషర్సుకు సహాయం చేదామని, మేస్టర్లకు సహాయం చేదామని ఆలోచించడం తప్పితే పిల్లల గొడవ యెవరికీ లేదు. ఈ పాపం యెప్పుడు శమిస్తుందో తెలయకుండా ఉంది. సంస్కారం కావాలని ప్రజల్లోనుండి ఆందోళన బయలుదేరితేగాని యెవరూ కళ్లు తెరవరు. వ్యక్తులు చేసే ప్రయత్నాలకు ప్రజలే అధికారం యివ్వాలి; అండగా నిలబడాలి. నూతనాదర్శాలతో విద్యాలయం స్థాపించి నాగయ్య ప్రజల్లో ప్రబోధం కలుగజేస్తున్నాడు.

మనిషియొక్క జ్ఞానవికాసానికి మూలం భావంగాని భాష గాదు. కాబట్టి పిల్లలయందు బుద్ధివికాసం యేర్పడవలెనంటె వాళ్లలో ఆలోచనకు, కల్పనకు అవకాశాలు కల్పించాలి. ఊరికే అక్షరాలు దిద్దిపెట్టితేను, పుస్తకాలు చదివిస్తేను పిల్లలకు చదువు చెప్పటం అవుతుందనుకోటం చాల పొరబాటు. భావానికి రూపం కల్పించేది భాష. భావం లేని భాష ప్రాణంలేని బొంది. భావం ఉంటే అదే భాషను సృష్టిస్తుంది. పిల్లల్లో ఉండే క్రియాశక్తి, పరిశీలనాబుద్ధి, స్వతంత్రత స్వయంప్రకటనకొరకు తత్తర పడుతుంటాయి. వాటిని మంచి మార్గాల్లో పెట్టి వృద్ధి పొందించడం విద్యాలయాల పని. పిల్లలలో సహజంగా లేని శక్తిని బాహ్యంనుంచి మనం వాళ్లపై చొప్పించలేం. కనుక మన జాతీయావసరాలకు అనుగుణంగా వాళ్ల శక్తులను శిక్షించవలసి ఉంటుంది. ఉత్తమమైన సమష్టి గ్రామ జీవనానికీ, బాధ్యతలకూ, వాళ్లను తర్ఫీతు చేయడం మన కర్తవ్యం. జీవితానికి సంబంధంలేని విద్య నేర్పి యువకులను దేశం మీద వదిలివేస్తే, వాళ్లు గ్రామంలో ఉండే జీవితంతో పొత్తు కుదరక అసంతుష్టులై అశాంతికి కారకు లవుతారు. దీన్నిబట్టి మనకు అరాజకానికి నిజమైన కారణం యెక్కడ ఉందో బోధపడుతోంది. అరాచకంవల్ల దేశానికి, ప్రజలకు కలిగే లాభం యేమీ లేదు. ఏదైనా, నిర్మాణం, సృష్టివల్ల లాభం ఉంటుంది. అందువల్ల పిల్లల్ని స్వతంత్రమైన నిర్మాణశక్తి గల వ్యక్తులనుగా తయారు చేయడం విద్యయొక్క లక్ష్యంగా ఉండాలి.

జిల్లాబోర్డు, మ్యునిసిపలు పాఠశాలల్లో పిల్లలు చదువ గలరు, చదువలేరు అనిగాని, మేస్టర్లు చెప్పగలరు, చెప్పలేరు అనిగాని, తల్లిదండ్రులు కొనగలరు, కొనలేరు అనిగాని విచారణ లేకుండా ప్రైమరీ క్లాసు పిల్లలకు కూడా పది పండ్రెండు పుస్తకాలు పెట్టుతున్నారు. ఇదంతా చూస్తే కాకులను కొట్టి గద్దలకు వేయడంగా ఉంది. ఇన్ని పుస్తకాలు చదివే నేటి బడుల్లోని పిల్లకాయలకు, వీధిబళ్లో పెద్దబాలశిక్ష చదివే పిల్లవాడి కంటె యెక్కువ ప్రపంచ జ్ఞానం ఉందా అంటె అదీ శూన్యమే. వస్తుపరిచయం లేకుండా గ్రంథపరిచయంవల్ల జ్ఞానం యెప్పుడూ కలగదు. నిజానికి అనుభవ జ్ఞానమే జ్ఞానం కాని మిగతాది కాదు. కనుక పిల్లలకి అనుభవాన్ని ఆధారంచేసి జ్ఞానం కలగచేయాలిగాని కేవలం పుస్తకాలు ఆధారంగా ఉండకూడదు. ఒకటో క్లాసు మొదలు ఎం. ఏ. వరకు అన్ని శాస్త్రాలు గ్రామాన్ని ఆధారంగా చేసికొని బోధించడమే ఉత్తమ శిక్షణం. జీవితానికి సంబంధంలేని శాస్త్రాలు, సిద్ధాంతాలు అందరికి అవసరంలేదు. పిల్లల్ని నడిపించే తెలివితేటలు పంతుళ్లకు ఉంటే, పిల్లవాడు వాడిజ్ఞానాన్ని వాడే పుస్తకంగా రచిస్తాడు. ఈ విధాన్నే విదేశాల్లో వేరువేరు పేర్లతో ఉపయోగానికి తెస్తున్నారు.

గ్రామజీవితంలో అనుభవంలో ఉన్న వ్యవసాయం, కుటీరపరిశ్రమలు, వర్తక వ్యాపారాలు, సహకార సంఘాలు గ్రామపరిపాలన ఆధారం చేసికొని బాలురకు అనుభవపూర్వకమైన విద్య నేర్పవలసి ఉంటుంది. బడిలోనే ఈ అవకాశా

లన్నీ కల్పించి, సంఘాలు యేర్పరిచి పాఠశాలలోని వ్యవహారాలన్నీ బాలురచేతనే నడిపించటానికి కృషిచేయవలె. అప్పుడు గాని నూతనాదర్శాలతో, నూతన అనుభవాలతో, నూతన జాతి తయారుకాదు.

శిక్షయొక్క ఆదర్శం సమష్టిభావం, సహకారభావం సహజంగా యేర్పడడం. ఇందుకు దోహదం చేసే ఆటలు, పాటలు, జాతీయ వేడుకలు, పండుగలు అన్నీ సంస్కరించి గ్రామంలో పిన్నలు, పెద్దలు అందరు వానిలో పాలు పుచ్చుకొని సమష్టిభావం కలిగేటట్టుగా నాగయ్య యేర్పాటు చేశాడు. ముఖ్యంగా విదేశాల్లో జట్టు ఆటలకు చాల ప్రోత్సాహమిస్తారు. వానివల్ల పిల్లలకు నూతనజాతీయ లక్షణాలు యేర్పడుతాయి. ఆలాగే జాతీయగీతాలు ఒక మహాసభలో ఉండే వేలకొలది మనుష్యులు స్త్రీలు, పురుషులు కలిసి పాడుతుంటె యెటువంటి ఐక్యభావం, ఆనందం కలుగుతుందో చూడండి. ఆలాగే జాతీయ కసరత్తు, కవాతు ప్రజల్లో నవోత్సాహాన్ని కలగజేయడంలో సాటిలేని సాధనంగా ఉంది ఇతరదేశాల్లో. ఇటువంటివాటి కన్నిటికి విద్యాలయాన్ని కేంద్రంగా చేసి నడిపిస్తున్నాడు నాగయ్య.

ఈ నవజీవన వికాసానికి స్త్రీలు కూడ సుశీలసారథ్యం క్రింద పూర్తిగ పూనుకొన్నారు. గృహనిర్వాహకంవిషయంలో పురుషులతోబాటు స్త్రీలు కూడా కష్టపడి కుటుంబాదాయం వృద్ధిచేస్తున్నారు. జ్ఞానోపార్జన విషయంలో కూడ స్త్రీలు ఉపన్యాసాలకు, ప్రదర్శనాలకు హాజరై దేశస్థితిగతు

లర్థము చేసికొని సంసారాల్లో నవ తేజం ప్రకాశింపచేస్తూ పురుషులతోపాటు స్త్రీలు ముందంజ వేస్తున్నారు.

నాగయ్యకృషికి మూలశక్తి అతని ప్రార్థనాశీలత, సత్యనిరతి. అందువల్ల గ్రామజీవితానికి మకుటంగా ఒక ప్రార్థనామందిరం యేర్పాటుచేశాడు. ఆ మందిరంలో నిత్యం ప్రార్థన, సత్ప్రసంగాలు జరగటానికి యేర్పాటు చేశాడు. అంతేకాదు; జాతీయ పర్వదినాల్లో జాతిమతవివక్షత లేకుండా అందరు ఏకేశ్వరుని ఏకైకభావంతోను, భక్తితోను ప్రార్థించి సామరస్యం అనుభవించేందుకు అవకాశం కలిగించాడు.

నాగయ్యఊహాప్రపంచంలో ఉన్న నవజీవనం ఒక దారికి వచ్చి, ఒకరూపం దాల్చేటప్పటికి అయిదారేండ్లు పట్టి నా ఇప్పుడు యేవూరు చూచేవాళ్ళకు నోరూరుసట్టుగా ఉంది. గ్రామస్థుల్లో మొదట్లో కొంత నిరుత్సాహం, అసంతుష్టి, వైషమ్యం కలిగినా, నూతనవిధానం రూపం చెందటం మొదలుపెట్టగానే సంశయాలన్నీ విడిపోయి, విశ్వాసమూ, ఉత్సాహం యేర్పడింది. ఇప్పుడు ప్రజల్లో ఆత్మవిశ్వాసం, ధైర్యం, సాహసం యేర్పడ్డాయి. మనం యేకార్యమయినా సరే నిర్వహించగలమనే మనోనిశ్చయం, కాదు గర్వంకూడా కలిగింది. గ్రామం యెప్పుడూ నిత్యకళ్యాణం పచ్చతోరణాలతో కళకళలాడుతు యెల్లెడల నవజీవనం వెదజల్లుతూ ఉంది.

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B187 |
| పుస్తకం పేరు | మాఊరు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 [illegible] |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |